PRSUMO2A171

సాహిత్య
ప్రస్థానం
జూన్ 2016
సంపుటి : 15 సంచిక : 6

# సంధిగ్ధ సంధ్య

తెలుగు రాష్ట్రాలు అనే బహువచనం అమలులోకి వచ్చి ఈ జూన్ 2కు రెండేళ్లు పూర్తవుతుంది. అయినా దాని వల్ల ఉత్పన్నమైన సమస్యలు అలాగే కొనసాగడం బాధాకరం. కొన్ని ఇంకా తీవ్రమవుతున్నాయి. విభజన సమయంలో ఆంధ్ర ప్రదేశ్ ప్రత్యేకహోదాకు సంబంధించి ఇచ్చిన వాగ్దానాన్ని కేంద్రం వమ్ము చేయడం ప్రజల విశ్వాసానికే విఘాతం కలిగిస్తోంది. దీనిపై ఎడతెగని రాజకీయమే తప్ప అన్నమాట నిలబెట్టుకోకపోవడం ప్రజలలో అసంతృప్తి పెంచుతున్నది. హైకోర్టు విభజన వంటి విషయాల్లో తెలంగాణ ప్రభుత్వం కూడా పదేపదే వెంటపడినా ఫలితం లేదు. ఇరు రాష్ట్రాల మధ్య ప్రాజెక్టుల నిర్మాణంపైనా పదవ షెడ్యూలులోని సంస్థలపైనా తీవ్రమైన విభేదాలు కొనసాగుతున్నాయి. తెలంగాణ నూతన ప్రాజెక్టులు రాజ్యాంగ విరుద్ధమని ఎపి ఫిర్యాదు చేస్తుంటే తమ వాటా తాము తీసుకుని గతంలో జరిగిన చారిత్రిక అన్యాయాన్ని సరిచేస్తున్నామని ఆ రాష్ట్రం చెబుతున్నది. పదవ షెడ్యూలలోని ఉమ్మడి నిర్వహణ సంస్థల సమస్య అలాగే వుంది. ఈ జాబితాలో తెలుగు సాహిత్య సంస్కృతులకు సంబంధించిన తెలుగు విశ్వవిద్యాలయం పరిస్థితి కూడా గజిబిజిగా మారింది. విద్యుత్ రంగంలో ఉద్యోగుల బదలాయింపు కేటాయింపు వివాదంగానే కొనసాగుతున్నాయి. ఇక ఎపి నూతన రాజధాని అమరావతిలో నెమ్మదిగా నడుస్తున్న సచివాలయ నిర్మాణం తరలిపోవలసిన ఉద్యోగులకు వారి పిల్లలకు సమస్యలు తెచ్చిపెడుతున్నది. ఇరు రాష్ట్రాలలోనూ వడదెబ్బ కరువు దెబ్బ తీవ్రంగా వున్నాయి. తరతమ తేడాలున్నా రెండుచోట్లా రైతాంగం పరిస్థితి దీనంగా మారింది. ఈ సమస్యలన్నీ వదలిపెట్టి ఇతర పార్టీలనుంచి ఫిరాయింపులను ప్రోత్సహించడంలో మునిగితేలుతున్నారు. ప్రైవేటీకరణ పరుగులు తీస్తున్నారు. దేశంలో పెరిగిపోతున్న మతతత్వ రాజకీయాలను ఖండించడంలో ఇరు రాష్ట్రాల నేతలూ నీళ్లు నములుతున్నారు. మొత్తంపైన ఉమ్మడి సవాళ్లు విడివిడిగా ఆయా చోట్ల వున్న సమస్యలు కూడా సామాన్యులను ఆందోళనకు గురిచేస్తున్నాయి. తెలుగు రాష్ట్రాల సమస్యలపై రెండు వైపుల నుండి పరస్పర సంప్రదింపుల ద్వారా పరిష్కరించుకోవాలి. అందుకే ఇది సంధిగ్ధ సంధ్య. సమిష్టి కార్యాచరణ, సమరశీల ఉద్యమాలు, సమగ్రాధ్యయనం మాత్రమే దీనికి పరిష్కారాలు. సాహిత్య కారులు కూడా సమాజంలో సభ్యులుగానూ సృజన కారులుగా ఈ క్రమంలో ద్విముఖ బాధ్యత నిర్వహించాలి.

కవర్ డిజైన్ : గిరిధర్

బొమ్మలు : తుంబలి శివాజి, గంగాధర్

## ఈ సంచికలో ...





చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్‌భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్ ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్ - 500 020

మనీ ఆర్డర్లు, రచనలు పంపించవలసిన చిరునామా:
ఎడిటర్, సాహిత్య ప్రస్థానం, ఎం.బి. విజ్ఞానకేంద్రం, డో.నెం. 27-30-4, 3వ అంతస్తు, ఆకులవారి వీధి, గవర్నర్‌పేట, విజయవాడ - 520 002,
సెల్: 9490099059
ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

# అదృశ్యకాలం

విజయచంద్ర
9438720409



మా జీవితాల్లో పతాక శీర్షిక లుండవు
మొదటి పేజీ వార్తలుండవు
అనూహ్య పరిచయాలు
అపమాన వాక్య హుంకారాలు
ఎక్కడో ఎవరో శోధించి రోధించి
రక్త ప్రవాహాలను
విజృంభణలను పసిగట్టి
దీర్ఘ హృదయ చలనాలను
లెక్కగట్టి
ఒక మంచి మాటంటే
కాస్త సంతోషం
కించిత్ సంతృప్తి
ఆ సాయంత్రానికది పరమ సౌఖ్యం
గొప్ప ఉద్వేగం
మా బ్రతుకంతా అమావాస్యలే
మార్గావరోధకులు సభాస్థలి వరకూ
రానివ్వని ఘటనలే అధికం
ప్రచార సామ్రాజ్యానికి
మేమంటే అతిచులకన
మబ్బులతో కప్పేసి
వెనక్కితోసి
మట్టి మనుషులని చిన్న చూపుచూసి
ఛీ కొట్టి చీత్కరించి
అవతలకి గిరాటేస్తుంది

మిధ్యా ఆకృతులను సృష్టించో
పాత ప్రేతాలను పైకి తీసో
మాయా లోకంలో కూర్చొని పకపక
నవ్వుతుంది
సన్మానాలను పైరవీలతో అమ్మే
బజారులో
టీ కొట్టువాడే మా శ్రేయోభిలాషి
ఆటో తమ్ముడే సహవాసి
క్షురకారుడు చర్మకారుడు
సానుభూతిపరులు
యువకులూ విద్యార్థులూ
ప్రపంచం మార్చాలనే
ఉపాధ్యాయులూ
ఉసురు తీసుకుంటున్న
రైతులూ
వీరే కదా మా పాఠక వర్గం
మా ఇంటివాళ్లా
ఇరుగుపొరుగు
మా వీధివాళ్లు

పాత్రికేయులు
డాక్టరుగారు, లాయర్‌గారు
మా పేపర్ కుర్రాడూ
వీరే కదా మా ప్రజలు
వీరి మధ్యనే కదా మేం బ్రతికేది,
కలం పట్టేది,
ఊపిరి తీసేది,
ఏ నాగరికతలోనైనా
కలం ఆ దేశ ప్రజల జెండా
పాలకుల కది కావాలి ఎజెండా
విచిత్రం
ఇక్కడ తలలూపే గంగిరెద్దులే
కావాలి
ప్రతిపక్షం వద్దు



---

## మే నెల పురస్కారాలు

**మమ్మల్ని బతకనివ్వండి!**
కథకు: రూ.700/-
రచయిత : ఎం. రమేష్‌కుమార్

**రోహిత్...**
కవితకు : రూ .500/-
రచయిత : మోతి మోహన రంగ

సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి

వ్యాసం : తెలుగు రూపక సాహిత్యంలో దళిత జీవనం సంవేదన రచయిత : తన్నీరు కళ్యాణ కుమార్
ఈ రచయితకు 'కర్లపాలెం రుక్మిణమ్మ స్మారక పురస్కారం రూ. 500/- అందజేయబడుతుంది

పాఠకులు తాము చదివిన కవితలు, కథలు, వ్యాసాలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. సీనియర్, ప్రసిద్ధ రచయితల రచనలు కాక ఔత్సాహికులను, ఇటీవల రాస్తున్నవారిని ప్రోత్సహించడమే ఈ పురస్కారాల ఉద్దేశ్యంగా గ్రహించగలరు.

- ఎడిటర్

# చారాణా

అబ్దుల్ వహీద్ ఖాన్
9441946909



సెక్యూరిటీ రూం దగ్గర సైకిల్ దిగంగనే స్టాండేసిన అమీర్ న్యూస్ పేపర్ ముక్కలో చుట్టిన బన్ను రొట్టెను గార్డుకు ఇచ్చిండు. కొంచెంసేపైతే నైట్ డ్యూటీ చేసి దిగబోతున్న ఆ గార్డు.. ముఖం కడుక్కొని చాయ్‌ల అద్దుకొని తినటానికని ఆ రొట్టె కోసం ఎదురు చూస్తున్నాడు. ఎవరు నైట్ డ్యూటీ చేసినా.. వాళ్ళకి ఓ బన్ను రొట్టె ఇవ్వందే లోనికి పోనియ్యరు. సైకిల్ హ్యాండిల్‌కి చెరోవైపు తగిలించుకున్న సంచులల్ల నుండి ఐదారు పాకెట్‌లు తీసి గేటు బయటున్న చాయ్ బండ్లోళ్ళకిచ్చి, వాళ్ళిచ్చిన చిన్న పుస్తకంలో ఎన్నెన్ని బన్ను పాకెట్‌లు ఇచ్చాడో రాసిండు. వారానికి గాని లెక్కివ్వరు. సంచులు పట్టుకొని దవాఖానా లోనికి పోయి అమ్మటం షురూ చేసిండు అమీర్.

అందరూ వాన్ని "చారాణ". అని పిలుస్తుంటారు. చారాణది ఎన్కటి నుండి పలకటం అలవాటైంది వాడికి. పేరులో ఏముంది చారాణ పైసలు దొరికితే చాలు పూటగడుస్తదనుకునే మనస్తత్వం అమీర్‌ది. డ్రైవర్ పనికోసం దుబాయ్‌కి పోయిన తండ్రి యాక్సిడెంట్‌లో పోయినేడు అక్కడే చనిపోయిండు. అమీర్ కుటుంబం తన తండ్రి చివరి చూపుకు కూడా నోచుకోలేదు. అప్పటి నుండి అమీర్ తల్లి సుల్తాన్‌బీ యే ఆసరా. మంచానికి చీరను కట్టి చెమ్కీలు వేస్తుండేది. పత్తర్ గట్టి షాపోళ్ళ ఆర్డర్లకు మూడు, నాలుగు రోజులకు ఓ చీర పూర్తి చేసిచ్చేది. ఒక్కోసారి వారం కూడా అయ్యేది. వర్క్ శారీస్ డిమాండ్ ఉన్నప్పుడు రాత్రిళ్ళు కూడా పని ఉండేది. కూచొని కూచొని పని చేయడం వల్ల నడుము నొప్పి ఎక్కువై పనిని మానుకుంది. తనకు వచ్చిన అరబ్బీని చుట్టుపక్కల పిల్లలకు నేర్పిస్తూ వాళ్ళిచ్చిన పైసలతో ఇల్లు నడిపేది. ఈ మధ్య ఆరోగ్యం బాగాలేక తనకు జహేజ్ కింద ఇచ్చిన కట్టుమిషన్, గంగాళాన్ని అమ్మి వైద్య ఖర్చులకు వాడుకుంది. ఏదో.. కడుపులో క్యాన్సర్ వచ్చిందని చుట్టుపక్కల వాళ్ళు చెప్పుకుంటుంటే అమీర్ విన్నడు. కొడుక్కి తల్లి చెప్పలేదు. చెప్పినా అర్థం చేసుకోలేని వయస్సు అతనిది. అంతా నయం అవుతుందనే భరోసా ఇచ్చేది. ఆ తల్లికి మాత్రం తెలుసు తొందరలోనే కొడుకుకి దూరమైతనన్న సంగతి. ఆరోగ్యం క్షీణిస్తున్న కారణంగా సుల్తాన్‌బీ రాను రాను అరబ్బీకి వచ్చే పిల్లలనూ తగ్గించుకుంది.

ఫజర్ నమాజ్ తోటే మొదలు పెట్టి ఉదయం పది గంటల దాకా బన్నులను సప్లై చేయడం, మిగతావి మళ్ళీ తీసుకొని పోయి బేకరి షాపులో అప్పచెప్పటం, అక్కడే చాయ్, బన్ను తిని పదకొండింటికల్లా బహదూర్‌పురలోని కార్ఖానా కెల్లటం అమీర్ రోజూ వారీ పని. రంజాన్ నెలలో కార్ఖానా, బేకరి సేట్‌లు ఇచ్చే,

ఇప్పించే జకాత్, ఫిత్రాలతో సగం సంవత్సరం గడుస్తుంది. అదనపు ఖర్చులకు అప్పు చేయాలి లేదా ఏదైనా అమ్ముకోవాలసిందే. ఇప్పుడు అమ్ముకోవడానికి కూడా ఏమీ లేదు. పంచుకోగా నాన్న భాగానికి వచ్చిన ఒక్క రేకుల రూము తప్ప. పోయిన యేడే పెంకులను మార్చుకుని రేకులు వేసుకున్నారు. ఆ అప్పు తీర్చకోవటానికే.. నానా తంటాలు పడ్డారు.



ఆగని కాలం తన పని తాను చేసుకుంటూ పోతుంది. సుల్తాన్‌బీబీ క్యాన్సర్ పూర్తిగా కమ్మేసింది. చివరికి అల్లాహ్ దగ్గరికి వెళ్లిపోయింది. దీంతో ఒంటరి వాడైన అమీర్‌కు మేం తోడుంటామని చిన్నాన్నలు, మామయ్యలు హామీ ఇచ్చారు. అదే రోజు జహర్ నమాజ్‌లో తల్లి అంత్యక్రియలు పూర్తి చేశారు. అమ్మ చనిపోతుందని తెలుసు కానీ ఇంత తొందరగా అల్లాహ్‌కు ప్రియం అవుతుందని అనుకోలేదు అమీర్.

చాలామంది బంధువులున్నప్పటికి ఒంటరిగా ఫీలవుతున్నాడు. సాయంత్రం అవతున్నది. తను రోజూ బన్నులు అమ్ముకునే జజ్గిఖానా వైపు అమీర్ అడుగులు అప్రయత్నంగా కదులుతున్నాయి. అమీర్‌కు ప్రతి అడుగులో అమ్మ గుర్తుకొస్తుంది. అప్పటికే మూడు రాత్రులు అమ్మ లేకుండా గడిశాయి. ఇక ముందు కూడా గడపాలి ఎలా..? ఎక్కడ వుండాలి..? చిన్నాన్న దగ్గరా..? మామ దగ్గరా..? బేకరి సేటు, కార్ఖానా సేటు కూడా నా బాగోగులు చూసుకుంటామన్నారు. లేకపోతే తనే ఒంటరిగా నా..? కొద్దిపాటి వంట కూడా వస్తది..! వచ్చిన కూలి డబ్బులు ఎవరికివ్వాలి..? ఎక్కడ దాచి పెట్టుకోవాలి..? ఒక్కడే కాబట్టి పని చేయాలా...? వద్దా..? ప్రశ్నలు అమీర్ బుర్రను తొలుస్తూనే ఉన్నాయి. ఆలోచనలో ఉండగా దవాఖానా వచ్చేసింది. సైకిల్ మీద వచ్చినపుడు కూడా అంత తొందరగా రాలేదు. ఆలోచనలతో ఉన్నందుకు చాలా తొందరగా వచ్చినట్లు అనిపించింది.

చాయ్ బండ్లోల్లు ఆప్యాయంగా పలకరించారు. గార్డూ దగ్గరకు పిలుచుకుని ధైర్యం చెప్పాడు. ఏదైనా అనాధాశ్రమంలో చేర్పిస్తామని చెప్పాడు. అమీర్ ఇపుడు అనాధ అని గార్డు గుర్తు చేయకనే చేశాడు. తను అనాధనని ఇంతవరకు బుర్రలో రాలేదు. ఎక్కడలేని దుఖం పొంగుకొచ్చింది. దానిని సమజాయించడానికి గార్డు నానా తంటాలు పడాల్సి వచ్చింది. చాయ్ బిస్కట్లు ఇప్పించిండు. రూంలో కూర్చోబెట్టుకుని దగ్గరకు తీసుకున్నాడు.

ఆ రాత్రి జజ్గీఖానా ఎప్పటిలా కనిపించడం లేదు. నిండు వెన్నెల ఉన్నప్పటికీ.. లైట్ల వెలుతురులో మెరుస్తున్నది. ఎంతో అందంగా కనిపిస్తున్నది. ఆకాశం వెన్నెలను కమ్మేసిన కరెంట్ కాంతులతో నిండి వుంది. ఆ నిండిన కాంతులలో అమీర్ అమ్మ కోసం చూస్తున్నాడు. దవాఖానా పై అంతస్తు.. ఆపై ఆకాశం తప్ప ఏమీ కన్పించటం లేదు. ఆ ఆకాశంలో అమ్మా.. కనిపించటం లేదు. తను పుట్టింది కూడా ఈ దవాఖాన్లానే. అమ్మ, నాన్నా నన్ను ఇక్కడి నుంచే ఇంటికి తీసుకెళ్ళారు. అప్పుడు పాత బిల్డింగ్ ఉంటుండెనంట.

రాత్రి తొమ్మిది అయ్యినట్లుంది. నర్సులు కొందరు డ్యూటీ ముగించుకుని పోతున్నారు. అమీర్.. ఆగయా..? అనే పిలుపు రోజూ ఈ టయానికే విన్పించేది. ఇక నుండి ఆ పిలుపుకు దూరమైనాను. అమ్మా, నాన్న లేకుండా బతికే కాలం కూడా కాదన్నది.. మనసులో మెదిలినంతలోనే కన్నీళ్ళు కారటం మళ్ళీ ప్రారంభమైంది. కుర్తా పైకెత్తి కళ్ళు తుడుచుకుంటుండగా గార్డు రూంకు అనుకొని వున్న సైకిల్ స్టాండ్ చివర ఎవరో కదులుతున్నట్లు గమనించాడు. అటువైపు చూశాడు అమీర్. ఆలోచనలకు బ్రేక్ పడింది. ఒకామె రగ్గు కప్పుకొని కూర్చుని ఉన్నది. రగ్గులోంచి సన్నగా పసి పాప ఏడ్చే శబ్దం వినిపిస్తుంది. ఇక్కడెందుకుంది.. ఈమె..? ఇంటికైనా ఎళ్లాలి. లేకుంటే దవాఖాన్లా నన్న ఉండాలి..!

పిల్లల్ని ఎత్తుకు పోయెటామెనా..? కాకపోవచ్చు. ఎందుకటే వాళ్ళు ఇక్కడ ఉండరు. ఎత్తుకుని వెంటనే పారిపోతరు. ఏది ఏమైనా పోయి పలకరిద్దామని బయలుదేరిండు అమీర్. రాత్రికి.. ఇంటికెందుకెళ్తావు. ఇక్కడే పడుకోవచ్చు గదా! నా దగ్గర రగ్గు వుంది. రేపు పొద్దున్నే ఆశ్రమానికి వెళ్దాం అని గార్డు చెబుతున్నప్పటికీ అవేం వినిపించుకోకుండా ఇపుడే వస్తానని.. పార్కింగ్ షెడ్డు చివరికి వెళ్ళాడు.. అమీర్.

"ఎవరు ఆంటీ.. ఇక్కడెందుకున్నావు..?"

జవాబు లేదు.

"ఏంటి ఎవరూ రాలేదా..?"

మళ్ళీ జవాబు లేదు.

నాలుగైదు సార్లు అడిగాడు అమీర్ కానీ ఆమె నుండి ఏ సమాధానం రాలేదు.

వెనక్కివచ్చి, గార్డు తాతను అడిగాడు. ఆమె ఎవరని.

"అవన్నీ నీకెందుకురా.. వచ్చి పడుకోరాదు" అన్నాడు గార్డు.

అమీర్‌కి ఆసక్తి ఎక్కువైంది. మళ్ళీ అడిగాడు. గార్డుకి నోరు విప్పక తప్పలేదు...

"రెండు రోజుల క్రితం కాన్పు కోసం వచ్చింది. నాల్గవ కాన్పంట. ఈ కాన్పులో కూడా అమ్మాయే పుట్టిందని భర్త, అత్త, మామలు హాస్పిటల్లనే పంచాయితీ చేసి తెగతెంపులు చేసుకొని ఆమెను ఈడనే వదిలిపెట్టి పోయిన్రు"



"మరి ఆమె అమ్మానాన్నలు"..? అమాయకంగా అడిగాడు అమీర్.

అబ్బాయి పుట్టి ఉంటే బాగుండేది కదా.. మనువు ఇచ్చినాంక చావైనా బతుకైనా.. వాళ్ళతోనే.. మేమూ ఏం చేయలేమని వాళ్ళూ ఇక్కడే వదిలేసి పోయింద్రు. సాయంత్రం పూట యాడికి పోతదామె. ఈ రాత్రికి ఇక్కడుండి రేపు పొద్దున వెళ్తదిలే...

ఎక్కడికెళ్ళాలో..? ఏం పేరు..? ఏ ఊరు..?

పేరు బుచ్చమ్మ నంట. చానా దూరం నుండి బతకనీకె వచ్చింద్రంట. అయినా.. నీకెందుకు అవన్నీ.. నా దగ్గర టిఫిన్ ఉంది. తిని పడుకో. లేకుంటే ఇంటికి పో.. మీ బాబాయి వాళ్ళు ఎదురు చూస్తుంటరు. అని చెప్పడంతో ఆకలిగా లేదు.. ఇక్కడే పడుకుంటానని రగ్గు తీసుకున్నడు అమీర్.

***

ఉదయం ఏడవుతుంది...

దవాఖాన ముందున్న డబ్బాలోల్లు చాయ్ చేసి అమ్ముతున్నరు. ఇప్పుడు వాళ్ళే బన్నులు తెచ్చుకుంటున్నరు. పేషెంట్‌ల కోసమని గ్లాసులల్ల పాలు పోయించుకుని పోయేటోళ్ళు, చాయ్ బన్నులు కొనుక్కొని తాగేటోళ్ళు, కొని తీసుకుని పోయేటోళ్ళిస్తున్న పైసలు తీసుకుని గల్ల డబ్బల లెక్క తప్పకుండ ఏసుకునేటోళ్ళు, ఎవరి పనులల్ల వాళ్లు ఉన్నరు.

నిద్ర లేవంగనే గార్డుకు అమీర్ కనిపించలేదు. రాత్రి ఇక్కడ పడుకున్న అమీర్‌ను ఎవరన్నా చూసిన్రా..? ఎక్కడ పోయిండబ్బా..? అనుకుంట గార్డు తాత రోజూ.. అమీర్ వచ్చే దారి దిక్కు చూస్కుంటూ.. చాయ్ బండ్లోళ్ళను అడిగిండు. ఎక్కడా.. కన్పిస్తలేడు. చెప్ప చేయకుండా ఎక్కడికి పోయిండబ్బ..? ఇంటికే పోయి ఉంటడేమో..? అని అనుకుంటుండంగనే దూరం నుండి అమీర్ సైకిల్ తొక్కుకుంట వస్తనే ఉన్నడు. ఎప్పటి లాగనే హ్యాండిల్‌కి బన్ను సంచులు ఉన్నయి. ఫజర్ నమాజ్ నుండి సరాసరి ఇక్కడికే వస్తున్నట్లున్నడు. తల్లి చనిపోయి.. నాలుగు రోజులైనా.. కాలేదు. అపుడే బన్నులు సప్లై చేయడం ప్రాంరంభించిండు.. వీడెంత గట్టోడురబై..! అని మనసులో అనుకున్నడు గార్డు.

చాయ్ బండ్లోళ్ళు కూడా ఆశ్చర్యంతో చూస్తున్నరు. అమీర్ మునుపటి కంటే హుషారుగా కన్పిస్తున్నడు. అమ్మ చనిపోయిన దుఖం కూడా కనిపిస్తలేదు.. సైకిల్ తొక్కడంలనే ఆ హుషారు కనిపిస్తుంది. దగ్గరికి రానే వచ్చిండు అమీర్. ఎదురుపోయిన గార్డు, ఏం.. రా..? చెప్పకుండ పోయినవు. అని గద్దించిండు. సమాధానం లేదు. అయినా ఇంత ఖుషిగా ఉన్నవు..? సంగతేంటి..? అమ్మను అపుడే మరచిపోయినవా..? మంచిదేలే.. కానీ.. ఇంత తొందరగా మరిచి పోతావనుకోలేదు. తిరిగి మంచిగైనవు.

"ఇంతకీ సంతోషానికి కారణం ఏందీ..?"

"ఏం.. లేదు గాని.. నాకు అమ్మ దొరికింది..!"

"ఆం..! అమ్మనా..!?"

"చనిపోయిన అమ్మ దొరకటమేందిరా..? మతి గిట్ల పోయిందా.. ఏమి..?"

"నిజమే.. దొరికింది."

పేరు బుచ్చమ్మ. చెల్లి కూడా దొరికింది. పేరు లక్ష్మి అని పెట్టుకున్నం. అంటూ.. ఎప్పటి లాగా పేపరు ముక్కలో బన్ను చుట్టి గార్డుకు ఇవ్వబోయిండు అమీర్. గార్డు అప్రయత్నంగా సైకిల్ స్టాండు దిక్కు చూసాడు. రాత్రి అక్కడున్న బుచ్చమ్మ కనిపిస్తలేదు. గార్డుకు అంతా.. అర్థమైంది. ఆ విషయం తెలుసుకున్న వాళ్ళు నోళ్ళు తెరచింద్రు. వాని చలాకి, మానవత్వం, మనసు ముందు ఎవరికి నోట మాట రావడం లేదు. రోజులాగా బన్నును తీసుకోవడానికి గార్డు చేతులు ముందుకు వస్తలేవు.

నాకిక ఏ దిగులూ లేదు. చూసుకోవడానికి అమ్మ, ఆడుకోవడానికి చెల్లి వున్నారు. అమ్మకూ నేను కొడుకునే దొరికా.. ఇంతకంటే సంతోషం ఏముంటది తాతా..? అని చెప్పుకుంటూ.. చేతులల్ల బన్ను సంచులు తీసుకుని ఎప్పటిలాగా దవాఖానాలకు పోయిండు.



## సమర్థ సారథి

- డా॥ సి. నారాయణ రెడ్డి



ఎంత సమీపంగా వున్నామో
ఇప్పుడిప్పుడే తెలుస్తున్నది.
ఎంతో దూరంగా వున్నామనే
వింత భ్రాంతి వీడిపోతున్నది
ఇటో అటో ఎటో తేలని
సంధిగ్ధ మతి
రెక్కలార్చుకుంటూ
ఉన్నచోటనే ఉండిపోయే
పక్షి వంటిది
తేల్చటంలో ఉన్న ధీ చతురత
నాన్చటంలో లేదు
చక్రాకృతిలో తిరిగే వాయువలయం
సూటిగా సాగే శ్వాస పురోగతికి
నిరోధకంగా వుంటుంది

కొమ్ములు దాచుకుని కుమ్ముకొచ్చే చీకట్లు
వెలుగుల వెన్నెముకలకు
కనిపించని గాయాలను కలిగిస్తాయి
తనువెల్లా పరుచుకుని పడుకొని వున్న
పండు టెండకు
చలిగాడ్పులు వణుకు పుట్టిస్తాయి

పచ్చగా ఎదిగే బతుకు
మొక్కలకు
విషమ పరిస్థితుల చీడ
తగులుకుంటుంది
సహజాతంగా పల్లవించే
అనురాగమైనా
అకారణంగా విస్తరించే
విద్వేషమైనా
హేతు సూత్రాలకు
అందుబాటులో లేనివి
రెండు దిక్కులను
ఒక్కటిగా సమీక్షించగలిగినప్పుడే
ఆ జీవితం
సమన్వయాత్మక ప్రగతికి
సమర్థ సారథి అవుతుంది.

## జలో రక్షతి రక్షితః

- సోమేపల్లి వెంకటసుబ్బయ్య



ఆ రోజుల్లో
గుక్కెడు నీళ్ళు గొంతులో పోసుకుని
గుండె ఆరాటం తీర్చుకునే వాళ్ళం
పొలాల్లో చెమటోడ్చి
కుంటల్లో నీళ్ళు
గటగటా తాగేవాళ్ళం
ఇసుక తిన్నెల్లో
చెలమలు తీసి
జలసిరిని అరచేతిలోకి తీసుకొని
గుటకలు గుటకలు మింగేవాళ్ళం
నదిలో నీళ్ళు
కళ్ళకద్దుకొని
కడుపారా సేవించేవాళ్ళం
ఎండన బడి వచ్చిన వాళ్ళకీ
పొరుగూరోళ్ళకీ
కుండల్లోంచి చల్లని నీళ్ళిచ్చి
సేద తీర్చే వాళ్ళం
ఇప్పుడు
పక్కనే ఉన్నా

నీళ్ళు ముట్టలేక పోతున్నాం...
ఒక్క గుక్క తాగామా
లెక్కలేనన్ని జబ్బులు
ఊరు చుట్టూ నీళ్ళున్నా
పుసూరు మనే వాళ్ళక్కూడా
ఉద్దరిణి నీళ్ళివ్వలేం
మనిషి జీవితంలో
వాటర్ బాటిల్ ఓ భాగమైపోయింది
అంతటా ఒక్కటే మంత్రం
వాటర్ బాటిల్... వాటర్ బాటిల్
నీళ్ళ సీసా మీద ఎంత నమ్మకం ...!?
కుళాయి నీళ్ళకి బిరడా బిగిస్తే

స్వచ్ఛమైన నీటి సీసా
అవుతుందా....
బోరింగ్ నీరు
బాటిల్‌కి చేరగానే
పరమ పవిత్రమవుతుందా...
ఖర్చు పెట్టిన కరెన్సీ
కన్నీళ్ళు తెప్పిస్తుంది
బ్రాండ్ నేమ్‌లతో మురిసిపోతే
బ్యాండ్ పడుతుందేమో...!
ఆకాశం నుంచి జాలు వారే నీరు
గొంతులోకి చేరేసరికి
గరళంగా మారడమేమిటి...!
బాధ్యులం మనమే
గాలిలాగా
ఇప్పుడు నీరు కూడా వాణిజ్య
వస్తువయింది
నీరు తాగాలన్నా
గాలి పీల్చాలన్నా భయం
ఇక మిగిలింది
వాటర్ బాటిల్స్ లాగా
ఆక్సిజన్ బాటిల్స్ రావటమే...!




# పాకుడురాళ్ళలో స్త్రీ జీవిత చిత్రణ

డా॥ఎం.ఎన్.బ్రహ్మానందయ్య
9704034854

ఏ రచనైనా, ప్రవహించే సమాజానికి ప్రాతినిథ్యం వహించాలి. అప్పుడే సంఘ జీవితం ఎలా ఉండాలో, ఉండకూడదో తెలుస్తుంది. అలా పాఠకుల్ని చైతన్యుల్ని చేస్తూ, యధార్థ వ్యధార్థ సినీ జీవితాన్ని వాస్తవ రూపంలో వ్యాఖ్యానించడానికి ముందుకొచ్చిందీ 'పాకుడురాళ్ళు'.

వాస్తవ ప్రపంచాన్ని, వంచన చేయకుండా చిత్రించే శక్తివంతమైన సాహితీ ప్రక్రియ నవల. 1965లోనే చీకటి ఊహల్ని చీల్చి, చీకట్లు గుట్టు ముడుల్ని విప్పి, ఆలోచనా వెలుగులు వెలుగులోకి తెచ్చిన ప్రౌఢ రచన రావూరి 'పాకుడురాళ్ళు'.

ఏ రచనైనా, ప్రవహించే సమాజానికి ప్రాతినిథ్యం వహించాలి. అప్పుడే సంఘ జీవితం ఎలా ఉండాలో, ఉండకూడదో తెలుస్తుంది. అలా పాఠకుల్ని చైతన్యుల్ని చేస్తూ, యధార్థ వ్యధార్థ సినీ జీవితాన్ని వాస్తవ రూపంలో వ్యాఖ్యానించడానికి ముందుకొచ్చిందీ 'పాకుడురాళ్ళు'.

'మాతృదేవోభవ' వేదోక్తి స్త్రీకి ఉన్నతమైన, ఉత్తమమైన భావ సంపదా శిఖరంపై సింహాసనం వేసింది. ప్రాచీన సాహిత్యం స్త్రీని పూజ్యురాలుగా చిత్రించింది. లిపి బద్ధంలో కనిపించే ఈ భావనలోని నిజం సంఘంలో ప్రతిబింబిస్తోందా! అంటే లేదనే చెప్తున్నాయి. ఆయా రచనల్లోని మరో సందర్భాలూ, సంఘటనలూ, కలంతో చెప్పేదొకటీ, కళ్ళతో చూసేదొకటీ అనే సత్యం సమాజంలో జగద్విదితం.

ముఖ్యంగా, స్త్రీ ప్రతివ్రతా, గుణవతీ, రూపవతీ, శీలవతీ, విలాసవతీ, వేశ్యావతీ, భోగమతి, భోగవతీ వంటి భావాలకే ప్రతినిధిగా సమాజ బజారుల్లో నిలబడింది. స్త్రీలపై ఆధిపత్య భావజాలం జరుపుతున్న లైంగిక అణచివేతల్లోని శరీర దోపిడీల కుట్రల్నీ, అన్యాయాల్నీ చిత్రిస్తూ, విమర్శాకోణంలో వ్యాఖ్యానించే ప్రాథమిక సాహిత్య ధర్మాన్ని కాల్పనికత సాహిత్యం సమాజానికి అందించలేకపోయింది.

నడుస్తున్న పరిణామాలనూ గుర్తించి, తదనుగుణంగా తన్ను తాను సరిచేసుకుంటూ సమాజ అభివృద్ధి కోరుతూ ముందుకు సాగేదే! ఆధునిక సాహిత్యం. ఆలా చలనచిత్ర రంగ లోతుల్ని మరింతలోతుకెళ్ళి, చీకట్ల తలకొట్టి, రంగుల బతుకుల్లోని చీకటి జీవితాన్ని వెలుగులోకి తెచ్చాయీ పాకుడురాళ్ళు.

పాకుడురాళ్ళు పాత్రలూ, సన్నివేశాలూ వాస్తవిక ప్రతీకలు. ఇప్పటికీ, ఇవో సినీజగత్తులో సర్వసాధారణ సజీవ పాత్రలు. పూట పూటకు, కడుపు నింపుకునే రంగు పాత్రల నుంచీ పూటకో స్టార్ హోటల్లో భోజనం చేసే ఖరీదైన రంగు పాత్రలూ, నటనా వ్యభిచారం, నిజజీవిత వ్యాపారం ఏకతరంగాలై ఉక్కు కీర్తి సంకెళ్ళు వ్యసనాలై ఆత్మహత్యల

రూపంలో నటీమణుల జీవితాలు ఎలా మోడుబారతాయి కళ్ళకు కట్టినట్లు 'త్రీడి'లో చూపించాయి పాకుడురాళ్ళు. "శిల్పం చెక్కడానికి శిల్పకారునికి ఎంత నైపుణ్యం ఉండల్లో, రక్తం గడ్డకట్టి ప్రాణం హరించే హిమద్రవ వాస్తవాల్ని, అక్షరమాల కట్టడానికీ, రచయితకూ అంతకుమించిన శక్తి కావాలి". వాస్తవ పరిశీలి రావూరి పాకుడురాళ్ళుల్లో అది నిక్కచ్చె వెలిగింది.




పురుషాధిపత్య భావజాలం స్త్రీజాతిపై చూపించిన ప్రభావం సామాన్యమైంది కాదు. స్త్రీ జాతి మొత్తాన్ని కుదించి ఒక ప్రత్యేకమైన సామాజికీకరణకు గురిచేయగలగడం ఆ భావజాల శక్తికి నిదర్శనం. అంటే తమను తాము స్త్రీలు కించపరచుకోవడం, పురుషులు కంటే దిగువస్థాయి వ్యక్తులుగా పరిగణించుకోవడం, స్త్రీ జాతికి పురుషాధిపత్యం నిర్దేశించిన ప్రత్యేక సామాజికీకరణ. బానిస వ్యవస్థలోనూ, లైంగిక దోపిడీలోనూ, ఆనందాన్ని అనుభవించడం వారికి ఓ విషాదం. వివిధ దశల్లో స్త్రీ జీవితాలెలా ఉండాలనీ, పురుషభావజాల ప్రపంచం భావించిందో అలాగే నిలబడ్డానికి ఇష్టపడటం, దానికే ప్రయ్యత్నం చేయడం, అందులోనే ఆనందాన్ని వెతుక్కోవడం, అదే జీవిత పరమార్థంగా భావించడం నేటి సమాజంలో మనం స్పష్టంగా గమనించవచ్చు. ప్రత్యేక సామాజికీకరణకు పై కారణాలు అద్దంపడుతున్నాయి. రావూరి నాటక రంగంలోనూ, సినీ జగత్తులోనూ వెల్లి విరిసిన స్త్రీ ప్రత్యేక సామాజికీకరణకు పాకుడురాళ్ళులో చూపించే ప్రయత్నం చేశాడు.

'నవ్యాంధ్ర కళా మండలి'కి మాధవరావు, రామచంద్రం ఇద్దరూ రెండు కళ్ళు. ఈ నాటక మండలికి అనుకోకుండా ఒక స్త్రీపాత్ర అవసరం కావడం, గుంటూరువెళ్ళి రామచంద్రం మంగమ్మను తీసుకురావడం జరుగుతుంది.

మంగమ్మ అందాల భరిణి. నాటక శిరోమణి. ముఖ్యంగా, పదహరణాల మిసిమి వయస్సినీ. ఆమె వయస్సునూ, అందాన్నీ నాగమణి పరపురుషులకు ఎరవేసి, ధన సంపాదన చేస్తుంటుంది. ఇక్కడ నాగమణి పురుషాధిత్య భావజాలం సంఘంలో వేసిన ప్రత్యేక స్త్రీ సామాజికీకరణకు లోబడిన పాత్ర ప్రతినిధిగా కనిపిస్తుంది. మంగమ్మ కళాపోషణలో కీర్తి సంపాదనపై దృష్టిపెడితే, నాగమణి, మంగమ్మ కన్నెరికం కోసం సమాజం ఖర్చుపెట్టే సంపాదనపై దృష్టి నిలిచిన పాత్ర. ఈ రెండు పాత్రలూ ప్రత్యేక సామాజికీకరణ కనుగుణమైన పాత్రలే.

గుంటూరులోని కంపెనీకి ఏదోవంకతో నాగమణి, మంగమ్మను తీసుకెళ్ళి రెండురోజుల్లో తిరిగి నాటక మండలికి పంపుతూ వుండేది. వచ్చేటప్పుడు పది రోజులు లంఖణం చేసినదానిలా జోగులు కడుతూ వచ్చేది మంగమ్మ. రామచంద్రం గ్రహించి నాగమ్మ పై మండిపడితే "సంపాదించుకొనే వయస్సిదేనయ్యా బాబు మరో పదేళ్ళు పోతే ఎవరూ వాసనన్నా చూడరు. మీరు ఇవ్వనూ ఇవ్వక, వచ్చే మారాజును ఇవ్వకుండా చేస్తే ఆనక దాని గతేంగాను?" అంటుంది నాగమణి.

పూలు వాసన కోల్పోయినా, ఆడది వయస్సు కోల్పోయినా బజారులో రేటు పలకదు. ప్రత్యేకీకరణ వ్యాపారసూత్రం ఇది. ప్రాణంలేని వాటికి, ప్రాణంతో పాటూ మనస్సు వున్న ఆడమనిషికి, పురుషాధిపత్య సమాజ దృష్టిలో తేడా లేదనే కఠోర సత్యాన్ని రచయిత వెలికి తీస్తున్నాడు.

ఓ వెలుగెలిగిన నవ్యాంధ్ర కళామండలి మూత పడింది. మంగమ్మ వైభవం పోగొట్టుకొనీ పొట్టచేత పట్టుకొనీ రోడ్డున పడింది. అయితేనేం? అందం ఉన్న మంగమ్మను గుంటూరు కంపెనీ కళ్ళకు అద్దుకొని నెత్తిన పెట్టుకోగలదు. చేయవలసిందల్లా ఒక్కటే. 'తనీరోజున మళ్ళీ కాస్తా కాలుజారితే తను అందలాల్లో ఊరేగించేవారున్నారు. తన్ను పూజించేవారున్నారు' అంటూ హొటల్ గదిలో కూర్చోని పథకం చేస్తూ ఉంటుంది మంగమ్మ. మానధనం ఉండాలి. అసలు ధనం కన్నా మానమే మూల ధనం అంటుంది శాస్త్రం. మరి దానితోనే ధన సంపాదనకు దింపే తన అందం, కొండంత హేతువై ఉన్నప్పుడు తప్పేముంది. ఇదీ సంఘబద్ధమైన ఆమె స్వగతంలోని తత్త్వం.

వృత్తి రీత్యా రాజ్యమణికి మంగమ్మ పాత స్నేహితురాలు. ఒకసారి కలవడానికి ఇంటికి వెళ్ళిన మంగమ్మను లోపలికి తీసుకెళ్ళుతుంది రాజమణి. 'ఆ వరండాలో అడుగులు వేస్తూనే మంగమ్మ వణికి పోయింది. ఆ గదులన్ని తనకు పరిచితమైనవే. వాటిల్లో తాను నెలలకు నెలలు గడిపింది. ఇప్పటికి ఏ గదిలో ఏమి జరిగిందీ మంగమ్మకు జ్ఞాపకం ఉంది'. ఇక్కడ మంగమ్మ వణకడం, పరిసరం ఆమె శరీరానికి ఆపాదించిన అనుభవం. ప్రతి గదిలోను. గతానుభవ వ్యథాభరిత కురుకులు మళ్ళీ సాక్షాత్కరించి, శరీరం వణికిందని రచయిత, శరీర దాహాన్ని తీర్చుకొనే సమాజ అవకాశ నైజాన్ని

జ్ఞాపకం చేశాడు.

రాజమణి ఇంటిలో వసంతను చూసి, మంగమ్మ "తెలివైన ముఖం, ఇంకా నలిగిపోని పువ్వులాగా నవనవలాడుతూ ఉంది అంటుంది." బజారు వీధుల్లో రంగు రంగుల 'పూల కుప్పలు' పోసి అమ్ముతుంటారు అమ్మకందార్లు. ఏ కుప్ప లోని పూలు నవనవలాడుతుంటాయో వాటికే గిరాకే. వాడిన వాటికీ, కుళ్ళిన వాటికీ అంత విలువ చూపరు. రాజమణి కంపెనీకి వసంత కూడా ఓ నవనవలాడే పువ్వే.




ప్రపంచానికి, సినీ ప్రపంచానికి మధ్య వర్ధిల్లే సాగించే అనుభూతికి చలపతి ఓ తెలివైన ప్రతిబింబం. వెండితెర ప్రపంచానికి పరిచయం చేస్తానని భరణా కింద మంగమ్మకు ఓ నాలుగు వందలు ఇచ్చి వెళతాడు. దీన్ని సరైన నిర్ణయంతో తూచడానికి రాజమణి సలహా కోసం కంపెనీ తలుపుల తెరిస్తుంది మంగమ్మ. పూలపై తుమ్మెదలు వాలినట్లు రాత్రిళ్ళు ఎప్పుడూ కోలాహలంగానూ, రంగరంగ వైభవంగానూ విటులతో తులతూగిన ఆ గదులు పగల్లు నిర్జీవంగా, నిశ్శబ్దంగా ఉన్నాయి. "వాళ్ళను చూస్తుంటే మంగమ్మకు గుడ్లగూబలు జ్ఞాపకం వచ్చాయి. గుడ్లగూబలు పగలంతా నిద్రపోయి, రాత్రిళ్ళు సంచారం బయలు దేరుతాయట. వీరూ అంతే! రాత్రంతా జీవిస్తారు. పగలు చనిపోతారు. నిజానికి పగలే జీవిస్తున్నారనాలేమో!" అంటాడు రచయిత.

నిజమే! నేటి జీవితం ధనార్జనమీద ఆధారపడింది. ఆ సంపాదన స్వేచ్ఛతోనూ, ఇష్టంతోనూ, ఆత్మవిశ్వాస ఊపిరితోనూ అయి ఉండాలి. అప్పుడే ఆ ధనం జీవితానిస్తుంది. సంతోషానిస్తుంది. అది లేని సంపాదన మరణంతో సమానం. ధనం చేకూర్చకపోయినా, స్వేచ్ఛలోనే జీవితం ఉంటుందనే విశేషంశాన్ని రచయిత ఆఖర్న వారు పగలే జీవిస్తున్నారంటాడు.

కుక్కలూ, వేటకుక్కలూ పోలికలో తేడా లేకపోయినా అభిరుచుల్లో కొంత తేడాలుంటాయనేది తెలిసిన నిజమే. కుక్కల మనస్సు ఎప్పుడూ మాంసం మీదనే ఉంటుంది. వేటకుక్కలది మరీనూ. పురుషులందు పుణ్యపురుషులు వేరయా! అన్నట్లు వీరిలోనూ, మాంసముద్దలపై ఆకలితో అల్లాడుతుంటారు. మామూలుగానే మగాడు రెచ్చిపోతాడు. 'చలపతి మరోసారి వేటకుక్కలా మారిపోయాడు'. చలపతి మగాడు వేట కుక్కలా ఎలా మంగమ్మపై రెచ్చిపోయింది పై వాక్యం చెపుతుంది. అవకాశం దొరక్కపోయినా, దొరికే దాకా పరిసరాల్ని తన ఆధీనంలోకి తీసుకుంటే ఒక సారేం కర్మ! ఎన్నిసార్లైనా మగాళ్ళు వేట కుక్కల్లా మారుతారనే సామాజిక అనైతిక కోణంలోని అనైతికాన్ని రచయిత సూచించాడు.

శర్మ, వీడో అప్రాచ్యపు రిపోర్టర్. అవసరానికి ఎంతకైనా తెగిస్తాడు. మంగమ్మ నటిగా పైకి రావాలని వేసిన చలపతి పాచిక శర్మకు ఐదువందలు ఇచ్చేటట్లు చేసింది. ఆ 'పద్మవ్యూహాన్ని' ఛేదించడానికి మంజరి మానాన్ని ఎరగా వేయడానికి ఉపాయం వేస్తాడు చలపతి. అటువంటి ఎన్నింటి వ్యూహకత్తుల పోట్ల అనుభవాలు ఇదివరకూ మంజరి సొంతమే. కానీ ఇదో సినిమా జగత్తు గమ్మత్తైన పద్మవ్యూహం.

సౌందర్యపిపాస పిశాచాలుగా సినీ జగత్తులో ఎందరో ఉన్నారు. ఆ కొస, ఈ కొస వరుసలో వేంకటేశ్వర్లు ఒకడు. సినీమాయా లోయలోకి జారిపోయాడు. సినీ జగత్తుకు వీసమెత్తు వింతా, చింతా వుండదు.

ఇంకో సన్నివేశంలో వేంకటేశ్వర్లు తోడేలుగా మారి మంజరీని తన మీద పొదుపుకొని, గట్టిగా నిట్టూర్చాడు. "విశ్వాన్ని జయించిన వీరునిలాగా వేంకటేశ్వర్లు నవ్వుకుంటూ కూచున్నాడు". విశ్వం ఏర్పడిందంటే అది సృష్టి మూలం అని చరిత్రా, పురాణాలు స్పష్టం చేస్తున్నాయి. ఆపనే చేశాడు వేంకటేశ్వర్లు. చలపతి పద్మవ్యూహం ఫలించింది. మంజరి మానాభిమన్యుడు కత్తికి ఒరిగాడు. అయితే ఈ మానాభిమన్యుడో అక్షయ తునీరకోన. తరగడూ, అరగడూ. అందుకే అవసరానికి చలపతి పద్మవ్యూహం వేస్తాడు. మంజరి గెలిపిస్తుంది. ఒక్కొక్కసారి తన కోసం కూడా గెలుస్తుంది. ఇదే స్త్రీ ప్రత్యేక సామాజికీకరణ వ్యవస్థంటే.

ఈ సారి వేంకటేశ్వర్లు మంజరీతో పద్మవ్యూహాలు కాకుండా "ఏక పత్నీవ్రత సూత్రాన్ని సంధి చేస్తున్నాడు. "నేను ఏకపత్నీ వ్రతుణ్ణని నీతో అనలేదని నా నమ్మకం అని వుంటే ఉపసంహరించుకుంటాను. ఒక్కముక్కలో చెప్పనా మరి! నువ్వు మనిషివి కావు–అంతే!.....నువ్వో దేవకన్యవు. అప్పరసవు" అంటారు. స్త్రీని దేవకన్య గానో, అప్పరస గానో అభూతలోక సౌందర్యవతి గానో చిత్రిస్తే తప్ప, అంతుకు మించిన అందమైన లైంగిక దోపిడికి ఆమె బలవ్వదు. లైంగిక దోపిడికి అందాన్ని ఆపాదించడమంటే ఇదేనేమో! మంజరీని హీరో రావుకు పరిచయ నిమిత్తం, ఆమె ముస్తాబు కోసం మేకప్ మేన్ని

నటేశాన్ని పిలిపిస్తాడు చలపతి. నటేశం మంజరీకి మేకప్‌చేస్తూ కొంత చనువును ప్రదర్శిస్తాడు. కలవరపడుతూ మంజరీ స్వగతం "ఆ నిశ్చయమయ్యాక ఆ! చేస్తే చెయ్యనిద్దూ. ఇంతలో ముంచుకు పోయేదేమిటి గనుక" అంటుంది.




నిండా మునిగితే చలేమిటి? ఆపై అది చెరువునీరూ, కాలవ నీరూ, మురికినీరూ, ఉప్పునీరూ ఏవైతేనేం? మంచో చెడో, ఓ పని పూర్తిగా చేయాలనే సంఘవిజయం తొణికిసలాడిన వైనం చూపిస్తాడు రచయిత మంజరి స్వగతంలో.

చందూలాల్. ఇతనో సంపన్నుడు. డబ్బు మంచినీళ్ళు ప్రాయంగా ఖర్చు చేస్తాడు. డబ్బే కాదు దొరికినవన్నీనూ. రచయిత ఇతన్నో తోడేలుగా అభివర్ణిస్తాడు.

మహావృక్షాన్ని తీగ అల్లుకుంటేనే దాని భవిష్యత్తుకు ఆసరా! ఇదో అడవి న్యాయం. అవసరానికి ఈ న్యాయాన్ని సమాజం అన్వయించుకుంటుంది. ఇక్కడ చందూలాల్ అడవి మహావృక్షం. మనిషే కాదు మనస్సు కూడా. అందులోని కోరికలు మరీ మరీ. చందూలాల్ మంజరిని లొంగదీసుకుంటూ "మంజరిని జుట్టు విరబోసుకోమన్నాడు. పిచ్చి కేకలు వేస్తూ గదంతా తిరగమన్నాడు. తనకు చప్పున దొరక వద్దనీ, దొరికినా కొట్టి రక్కి తప్పించుకోమని అడిగాడు".

"కందిరీగ కాలికి కుట్టిందటే కళ్ళకు చీమిడి రాసినట్లు" రసికత కూడా ఓ పిచ్చేకదా! అందునా అతనో మహావృక్షమాయె!

మంజరీ కన్నా ముందే సినిమాల్లో వేషాలు వేస్తున్న నటి కళ్యాణి. ఓ ప్రక్క వేషాలూ, మరోప్రక్క రస వేషాలూ పోషిస్తున్న నాయిక. కన్నమ్మగా ఉన్నప్పుడు కేవలం పాతిక రూపాయలకు తొలిసారిగా ఒళ్ళు అప్పగించేలా చేసిన సంఘ నైజాన్ని చవి చూసిన పసి నెరజాణ. సినిమాలో వేషం ఇప్పిస్తాననీ గళ్ళులుంగీ (బ్రోకర్) ప్రొడక్షన్ మేనేజర్‌కు కన్నమ్మను పరిచయం చేస్తూ "ఒకటో నెంబర్ సరుకండీ!...అన్నీ ఒకటో నెంబరు సార్! చిలక కొరకని కాయ. గరువు గారికి అర్పిస్తున్నాను...కిందటి సారి కూడా గురువుగారు తక్కువ చూపు చూశారు. ఆ వారా, ఈ వారా ఈ దఫా చూపించాలి" అంటాడు.

రైతులు, కష్టపడి పండించిన ఫలసాయాన్ని కూడా నిక్కచ్చిగా ఖరీదు ఇంత అని చెప్పడానికి జంకుతారు. బ్రోకర్స్‌కీ ఆ బాధగానీ, భయంగానీ సంఘం ఇవ్వదు. అది అంతే! బలిసిన సమాజావసరాలు తీర్చేవాడుకదా! మరి.

ఏ రంగంలో అయినా ఒకటో నెంబరుకున్న ప్రాధాన్యత దానిదే! (దీని తస్సాగొయ్యా) ఈ నెంబరు ఆటలూ, పాటలూ, విద్యార్థుల మార్కుల్లోనే కాదు. రసికతకూ ఇది మంచి చమురు దీపమే. డబ్బులో సుఖముందంటారు. సుఖంకోసం డబ్బును వెదజల్లుతుంటారు. ఈ సూత్రాన్ని నమ్మి సమాజంలో మధ్యవర్తులు ఎవరికి ఏవి లేవో, వాటిని వారికి నైవేద్యంగా సమర్పిస్తుంటారు.

కళ్యాణికి గళ్ళులుంగీ విడమరచి చెప్పాడు. ఓస్ ఇంతేకదా! అన్న కళ్యాణిని "మేకప్ రూమ్ గూండా, పెద్ద పెద్ద అడవుల బొమ్మలున్న తడికల వెనక్కు తీసుకెళ్ళాడు" గళ్ళు లుంగీ.

నిద్ర సుఖ మెరుగదు. రసికత నైతికత గమనించదు. అడవి బొమ్మలున్న తడిక చాటున్న మానవ జంతువైన ప్రొడక్షన్ మేనేజర్‌కు కళ్యాణి కన్నెరికాన్ని బలిచేసుకున్న సినీ నైజాన్ని తూర్పారబట్టాడు రావూరి.

కన్నమ్మ కళ్యాణిగా మారి కాలాన్నంతా పరిశ్రమ మీద కేంద్రీకరించింది. దొరికిన ప్రతిదాన్ని సద్వినియోగం చేసుకుంటూ, శరీరాన్ని వాడవలసిన చోట అవసరంగా నిస్సంకోచం వాడింది. "ఓ గంట తేడాగా, తండ్రీ కొడుకులతో ఒకే గదిలో, ఒకే మంచం మీద కళ్యాణి గడిపిన సందర్భాలు చాలా ఉన్నాయి". రచయిత, చెప్పదలచిన అంశాన్ని సూటిగా చెప్తాడు. సినిమా రంగం ఎంత హీనమైన స్థితిలో ఉందో, మరెంత కుళ్ళిపోయి ఉందో, అద్దంలాంటి పై వాక్యం చాలు. ఇంత చేస్తేనే హీరోయిన్‌గా వెలుగొచ్చేది. చప్పట్లు, ఈలలూ వినిపించేది. దండాలూ, దాసోహాలూ సమర్పించేది. మొత్తం కీర్తి సొంతమయ్యేది. ఇదో బ్రోకరత్వ నాటక రంగం. కాదు కాదు జీవితాన్నే నాటకరంగంగా, రంగుల రాట్నంగా మార్చే సినిమా రంగం.

భోగం మేళాలూ, అంతఃపుర ఉంపుడు గత్తెల వృత్తులూ, సమాజాన్నీ ఏ మేరకు దిగజార్చాయో సినిమా రంగం కూడా ఏ మాత్రం తగ్గినట్లు కానరాదు. నృత్యాలు, ఎక్స్ ఫోజింగ్స్, వికార భంగిమలూ వంటి రసావయవాల ఆనవాళ్ళు జనసంద్రాన్ని పిచ్చెక్కించె దృశ్యాన్ని రావూరి కళ్ళకు కడతారు.

# బోయ జంగయ్య కన్నుమూత

ప్రముఖ రచయిత బోయ జంగయ్య(74) మే 7న కన్నుమూశారు. నల్లగొండ జిల్లా పంతంగి గ్రామంలో 1942, సెప్టెంబర్ 1న జన్మించారు. బోయ జంగయ్య తెలుగు సాహిత్యంలో పలు ప్రక్రియల్లో విస్తృతంగా రచనలు చేసారు. అట్టడుగు ప్రజల దయనీయ గాథల్ని కథలుగా, నవలలుగా, నాటికలుగా మలిచారు. తెలంగాణ గ్రామీణ ప్రజల జీవన చిత్రాన్ని వాస్తవిక కోణంలో తన రచనల నిండా చిత్రించారు. వీరి రచనలలో 'జాతర' నవల ప్రాచుర్యం పొందింది. జగడం, పుట్టుమచ్చ, హెచ్చరిక, తుపాకులు వంటి నవలలు, గొర్రెలు, భోజ కథలు, లోకం, ఎచ్చరిక, పావురాలు, తెలంగాణ వెతలు, బడిలో చెప్పని పాఠాలు తదితర పదికి పైగా కథా సంపుటాలు, వెలుతురు, నడుస్తున్న చరిత్ర వంటి కవితా సంపుటాలు, జాషువా, అంబేద్కర్, కె.ఆర్. నారాయణన్‌ల జీవిత చరిత్రలు, జాతినేతలు, అడవిపూలు, మనం మారాలి వంటి బాలసాహిత్యం, కష్టసుఖాలు వంటి నాటికలు వెలువరించారు. జాతర నవలకు తెలుగు విశ్వవిద్యాలయం ఉత్తమ నవలా పురస్కారం లభించింది. చాసో పురస్కారం, శ్రీశ్రీ పురస్కారం వంటి పలు అవార్డులు అందుకున్నారు. నల్లగొండలోనూ, ఇతర ప్రాంతాల్లోనూ సాహితీస్రవంతి నిర్వహించిన పలు కార్యక్రమాల్లో బోయ జంగయ్య పాల్గొని ప్రోత్సహించేవారు. వారికి జోహార్లర్పిస్తున్నాం. – ఎడిటర్

"కొంతమంది దేవుడి పఠాలకు మల్లే గూళ్ళల్లో పెట్టి, దీపారాధన చేసి పూజ చేస్తే, మిగితా వాళ్ళు చొక్కాల్లో దుప్పట్లలో దాచి-అదన్నమాట సంగతి" అంటూ పూరింపును పాఠకుడికి అప్పగిస్తాడు. కథానాయికలు ఫోటోలను సైతం రసాభరణంగా వాడే స్థాయికి దిగజార్చిన సినిమా నిజంగా సిగ్గులేనిది, నీతిలేనిది, మానం లేనిది. కాదనే హక్కూ జ్ఞానం ఎవరికీ లేదనే విషయం పాకుడురాళ్ళు బద్దలు చేసింది. జ్ఞాన పీఠం అవార్డు కొట్టింది.

భూమి గుండ్రం ఉంది. ఎటు తిరిగీ, నిలిచి చెప్పుకునే చోటుకే వద్దాం. హాలివుడ్ నాయిక గ్లాడిస్ మన్రో. ఈమె తొలినాళ్ళలో భీతావహ దరిద్రం అనుభవించింది. ఆ విషయాన్ని మంజరీతో తానే చెప్పుతూ "నేను నా నగ్న చిత్రాన్ని ప్రకటనలకు అమ్ముకుని బతికాను", అంటుంది మన్రో నటి. నాయిక చెప్పే ఈ మాటలో ఆత్మవంచనలేదు. సమాజవంచన తప్ప.

సాటి మనిషికి ఆకలి వేసినప్పుడూ, అందులోనూ స్త్రీకైతే, సమాజం ఓ ముద్దు పడేయాలంటే, తన నగ్న చిత్రం చూపిస్తే తప్ప సాధ్యం కాదనే, అగ్నికణ భావం సమాజాన్ని ఎటు తిప్పుతుందో అనే భయం రాక మానదు.

అవసరానికి వేసే వల, కొన్ని సార్లు ధన, మానాలనే కాదు. ప్రాణాలూ తీస్తుంది. అసూయ చేతనో, అణగదొక్కాలనే వ్యూహం చేతనో, మరే అవసరం చేతనో నాయికలు నీలిచిత్రాల్లో చేయవలసి వస్తుంది. వికసిస్తే ఆ సందర్భాలే వారి పాలిట ఉద్యానవనాలు. వికటిస్తే అవి స్మశానవాటికలే. అది దురదృష్టం, అదృష్టాలనే బొమ్మా బొరుసూ మీద ఆ నాయిక జీవితం ఆధారపడుతుంది. ఎలాగైతేనేం చివరి అంకానికి వచ్చేసింది మంజరి వేషం. పదినిమిషాల పనికి సిద్ధపడింది. చేసింది.

కట్ చేస్తే... టెలిఫోన్ మోగింది. మంజరి ముఖం పాలిపోయింది. అన్యాయమంటూ న్యాయ దృష్టితో వేడుకుంది. డబ్బును ఆశగా ఎర చూపింది. టెలిఫోన్ శబ్దం ఆగింది. సక్సేనా సక్సెస్ అయ్యాడు వ్యూహం ఫలించింది. మంజరి వ్యూహం వికటించి సూర్యోదయానికి అస్తమయమయ్యింది.

సినీ జగత్తులో ఆడది ఓ వేషం వేయాలన్నా, తీయాలన్నా, కీర్తి సంపాదించాలన్నా, కోల్పోవాలన్నా, ఆఖరికి ప్రాణం ఉండాలన్నా, పోవాలన్నా రతి సిద్ధాంతం మీదనే ఆధారమంటూ ముగిస్తాడు రావూరి భరద్వాజ.

## సబ్బు

డా॥ ఎన్. గోపి



నేను పుట్టిన కొత్తలో
మా ఇంటికొచ్చింది సబ్బు
అందాల సబ్బు
మురిపాల సబ్బు
అయినా చాలా రోజుల వరకు
పిండితోనే ఒళ్ళు రుద్దేది మా అమ్మ

ఇప్పటికీ స్నానం చేస్తుంటే
రూపాయలు అరిగిపోతున్నట్టుగా వుంటుంది
అప్పుడప్పుడు కళ్ళల్లోకి జారి
నన్ను ఉగ్ర నరసింహుణ్ణి చేస్తుంది.

సబ్బు పరంగా మా యింట్లో
వర్గాలు ఏర్పడ్డాయి

మా మనుమడిది
సుందర సువాసనల ముద్ద
మగ్గులో వేసుకొని వాడు
బుగ్గల్లోంచి బుడగల్ని సృష్టిస్తాడు
వాటి పల్చటి నీటి గోడలు
గాలికి కూడా శోభనిస్తాయి.

సబ్బు మీద కంపెనీల పేర్లు
చెక్కుతారు గాని
తయారు చేసే కార్మికుడి పేరు
కనపడదు.

మైసూర్ సాండల్ సబ్బును చూసినప్పుడు
నాకు వీరప్పన్ మీసాలు
గరుగ్గా గుచ్చుకుంటాయి.

చేతులను శుభ్రంగా
కడుక్కోమంటున్నారు
మనస్సును క్షాళనం చేసే
సబ్బును కనిపెడితే బాగుండును
అప్పటిదాకా ఈ కవిత.



---

## కాలం

సుపర్ణ మహి
9866716422



తనంతే...
కలతనిద్రని కావలించుకు పడుకున్న
ఆశాంకురాల్ని చూసి
రేయిలా ముసి ముసిగా నవ్వుతుంది...

నువ్వా నేనా ఎవరు ముందు అని అడిగినప్పుడల్లా
అగాధంలాంటి కళ్ళలోకి లాక్కుంటూ
ఎప్పుడూ అడిగే ప్రశ్నేగా అని ఎగతాళిగా చూస్తుంది...

వెలుగు చప్పుళ్ళేవో చుట్టుకుని
పడక మీంచి ఉదయమై నిద్రలేస్తూ
కలలాంటి గుర్తేదో కళ్ళలోకి వొంపేసి నదిలా నవ్వేపోతుంది...

మేకుకి వ్రేలాడేసిన పన్నెండంకెల్లోకి
దగ్గరుండి పరకాయ ప్రవేశం చేయించి
కిటికీకి అతుక్కుపోయి అప్పుడికి వీడ్కోలు ఇస్తున్న రోజువారీ
జ్ఞాపకంలా చూస్తుంది ...

జీవితం ఓ పెద్ద ప్రయాణమని ఆశ చూపించి
అంతుతెలియని చరిత్ర అంతరంలోకి విసిరేసి
మారిపోయిన ప్రశ్నాపత్రం చూస్తున్న
బతుకు విద్యార్థివిరా నువ్వని 'పరమ్' బోధిస్తుంది...

అనుభవం కంటే గొప్ప గురువులేడని
అజ్ఞానం కంటే గొప్ప అర్హత ఏముందని
నీడ చివర్న దగ్ధమౌతున్న దేహమే
జ్ఞాన గీతకు ప్రయోగశాల అని మోక్షం చదివిస్తుంది...

ఎవరు నువ్వు అనడిగితే
కొలను అద్దంలో
ప్రతి రూపం చూసుకుంటున్న
ఆలయ శిఖరంలా మురిసిపోతూ
అసలు నిజం చెప్తుంది తనపేరు 'కాలం' అని...

'నేనెవరు' అని 'వెలుగు వెళ్ళిపోయాక
వొరుసుకుంటున్న చీకటి మధ్యలోంచి
అడిగితే చెప్పింది...
'నువ్వొంటరివి... ఒక్కడివి' అని...



# పోతులూరి వీరబ్రహ్మం - మానవతా విలువలు

డి. మల్లయ్య
99516 41645




బ్రహ్మంగారి పేరు వినగానే కాలజ్ఞానతత్త్వాలు గుర్తుకొస్తాయి. అయితే ఇది నాణేనికి ఒకవైపు మాత్రమే. మరొకవైపు బ్రహ్మంగారు తన పూర్వప్రవక్తల మార్గంలో నడుస్తూనే తనదైన ఒక నూతన మార్గాన్ని ఏర్పరచుకొన్న సంస్కరణవాది. కాళికాంబాసప్తశతి ద్వారా సంఘ సంస్కరణను చేశాడు. సంఘంలోని సాంఘిక దోషాలను సరిదిద్దడం అంటే మానవత్వ సిద్ధాంతాలకై చేసే పోరాటంగా చెప్పవచ్చును. సంఘంలోని ప్రజలను నిష్కామంగా ప్రేమించగలిగినవాడే దానిని సన్మార్గంలో పెట్టాలనుకుంటాడు. కాబట్టి సంఘ సంస్కర్తలను మానవతావాదులుగాను, సంఘసంస్కరణను మానవతావిలువల పునరుద్ధరణగాను చెప్పవచ్చును. బ్రహ్మంగారు తన కాళికాంబాసప్తశతి ద్వారా మానవతను బోధించి ఎన్నో మానవతా విలువల్ని వికసింపచేశాడు.

"హితేన సహితం సాహిత్యం" అంటే ప్రజలకు మేలు కల్గించేది, ప్రీతిదాయకమైనది, నీతిని బోధించేది, ధర్మప్రతిపాదనం చేసేది సాహిత్యం అని భావం. సాహిత్యం ఉపదేశ ప్రధానం కాకున్నను, దురుపదేశం మాత్రం కారాదు. వేదాలు, వేదాంతాలు, పురాణేతిహాసాలు లోక కళ్యాణానికీ, ప్రజలకు మంచిని ప్రబోధించడానికి ఉద్దేశించినవి. అయితే కొందరు స్వార్థపరులు తమ అధిపత్యాన్ని నిలబెట్టుకోవడానికి వాటిని తమ వరకే పరిమితం చేసుకొని, గిరి గీసుకొన్నారు. పదుగురికీ చెందవలసిన ఆ వేదవిజ్ఞాన సంపదను తమ గుప్పిట్లోనే దాచుకొన్నారు. అయితే అభ్యుదయవాదులు, సంస్కరణాభిలాషులు జరిగిన, జరుగుతున్న ఇలాంటి అన్యాయాలపై, అక్రమాలపై తిరుగుబాటును ప్రకటించారు. నిద్రావస్థలో ఉన్న సమాజాన్ని జాగృత పరచడానికి యత్నించారు. ఈ ప్రయత్నం వైయక్తికమైనది కాకుండా సామాజిక పరమైనదైనప్పుడు ఆ ప్రయత్నం చేసిన వారు ప్రవక్తలుగా చరిత్రలో నిలిచిపోతారు. అటువంటి వారిలో శ్రీమద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి ఒకరు.

బ్రహ్మంగారి పేరు వినగానే కాలజ్ఞానతత్త్వాలు గుర్తుకొస్తాయి. అయితే ఇది నాణేనికి ఒకవైపు మాత్రమే. మరొకవైపు బ్రహ్మంగారు తన పూర్వప్రవక్తల మార్గంలో నడుస్తూనే తనదైన ఒక నూతన మార్గాన్ని ఏర్పరచుకొన్న సంస్కరణవాది. కాళికాంబాసప్తశతి ద్వారా సంఘ సంస్కరణను చేశాడు. సంఘంలోని సాంఘిక దోషాలను సరిదిద్దడం అంటే మానవత్వ సిద్ధాంతాలకై చేసే పోరాటంగా చెప్పవచ్చును. సంఘంలోని ప్రజలను నిష్కామంగా ప్రేమించగలిగినవాడే దానిని సన్మార్గంలో పెట్టాలనుకుంటాడు. కాబట్టి సంఘ సంస్కర్తలను మానవతావాదులుగాను, సంఘసంస్కరణను మానవతావిలువల పునరుద్ధరణగాను చెప్పవచ్చును. బ్రహ్మంగారు తన కాళికాంబాసప్తశతి ద్వారా మానవతను బోధించి ఎన్నో మానవతా విలువల్ని వికసింపచేశాడు.

బ్రహ్మంగారు పద్యాలైనా, కీర్తనలైనా ఆషామాషిగా రాయలేదు. కవిత్వానికి సాంఘిక ప్రయోజనం ఉండాలని దృఢంగా నమ్మినవాడు కాబట్టే 'తీండ్రమైన కవిత గండ్ర గొడ్డలి లాగ' ప్రయోగించాడు, సంఘ సంస్కరణను చేబూనాడు,

స్వార్థమతులను, మృషాయతులను గడగడలాడించాడు. కూడు పెట్టని కుల బేధాలను వ్యతిరేకించాడు.

**ఆ. అన్నమయములైన వన్నిజీవమ్ములు**
**కూడులేక జీవకోటిలేదు**
**కూడు దినెడికాడ కులబేధమేలొకో**
**కాళికాంబ! హంస! కాళికాంబ!**

సంకుచిత కులమత భేదాలు ఉండకూడదనడమే గొప్ప మానవత్వం. భూమిపై జీవిస్తున్న అన్ని ప్రాణులు ఆహారాన్ని గ్రహించే జీవిస్తున్నాయి. ఆహారం లేకుండా ఏ జీవి కూడా మనుగడను సాగించడం లేదు. మరి కూడు తినెడికాడ కులభేదాన్ని మానవుడు ఎందుకు పాటిస్తున్నాడు? ఎక్కువ కులం, తక్కువ కులం అనే భేదభావంతో ఎందుకు ప్రవర్తిస్తున్నాడు? అంటూ కులభేదాల్ని తీవ్రంగా ఖండించి ఆనాడే మానవ విలువలకు ప్రాణం పోశాడు బ్రహ్మంగారు.

సమాజంలో తరతరాలుగా కరడుగట్టుకుపోయిన మూఢాచారాలను, మూఢనమ్మకాలను తీవ్రంగా ఖండించాడు బ్రహ్మంగారు. వాటిలోని యదార్థతను సత్యాన్ని గ్రహించాలని ప్రజాభ్యుదయంతో మానవతను ప్రబోధించాడు.

**ఆ. గాఢతమములైన మూఢ విశ్వాసాల**
**జలధి లోన మునుగు జనులకెల్ల**
**స్వేచ్ఛగోరువాడె సిద్ధుండు బుద్ధుండు**
**కాళికాంబ! హంస! కాళికాంబ!**

సమాజంలో కొందరు మేమే సంఘసంస్కర్తలమని గొప్పలు చెప్పుకుంటారు. ఇంకొందరు మేము జ్ఞానులం, విజ్ఞానులం అనీ అతిగా ప్రవర్తిస్తుంటారు. ఇదంతా సత్యం కాదని అన్నాడు బ్రహ్మంగారు. అమానవీయమైన మూఢనమ్మకాలతో, అజ్ఞానాంధకారంలో కొట్టుమిట్టాడుతున్న సమాజానికి కాంతిరేఖను చూపించి మానవతవైపు ఎవరు నడిపిస్తారో, ఎవరు నడుస్తారో వారే నిజమైన సంఘసంస్కర్తలనీ, మానవతావాదులనీ చెప్పి, మానవ చైతన్యాన్ని, మానవ పురోభివృద్ధిని ఆకాంక్షించిన నిజమైన మానవతావాది బ్రహ్మంగారు.

సమాజంలో మనిషి పుట్టినా పండుగే, చచ్చినా పండుగే. మనిషి ఏ శుభకార్యానికైనా ముహూర్తాన్ని చూస్తాడు. శుభం, అశుభం అనీ, తిథి, వార, నక్షత్రాలమీద ఆధారపడి ఎలా కాలాన్ని వృథా చేసుకుంటున్నాడో, ధనాన్ని ఏ విధంగా నాశనం చేస్తున్నాడో కూడా తెలియజేశాడు బ్రహ్మంగారు. అంత బాగా ముహూర్తం అనుసరించి నడిచే వారికి అంతా మంచే జరుగుతున్నదా అని ప్రశ్నించాడు.

**ఆ. ఆర్తి తీరుననుచు మూర్తమ్ము పెట్టిన**
**పెండ్లి కూతురపుడె ముండమోయు**
**కంకణాలనాడె కాటి కేగె మగండు**
**కాళికాంబ! హంస! కాళికాంబ!**

వీరబ్రహ్మంగారు ప్రజలమనిషి, ప్రజాచైతన్యం కోసం సంఘ సంస్కరణను చేపట్టాడు. అందుకనుగుణంగానే విశ్వమానవ సంక్షేమమే ధ్యేయంగా పరోపకారతత్వాన్ని బోధించాడు. మనిషై పుట్టినవాడు సాటిమనిషికి చేయూతనందించాలని సూచించాడు.

**ఆ. పరుల కొఱకు పాటుపడువాడు ధన్యుండు**
**పరము కొఱకు పాటుపడును యోగి**
**యోగికంటె ధన్యుదుత్తమోత్తము డౌను**
**కాళికాంబ! హంస! కాళికాంబ!**

పరులకు సహాయం చేసేవాడు ధన్యుడు. మోక్షం కోసం ప్రయత్నించువాడు యోగి. యోగి కంటే కూడా ఉత్తమోత్తముడైనవాడు ధన్యుడు అన్నాడు బ్రహ్మంగారు. అంటే మానవసేవే మాధవ సేవగా శ్లాఘించాడు. ఇంకనూ భగవంతుని పేరుతో భక్తి పేరుతో ప్రజాధనాన్ని, సమయాన్ని వృథా చేయడాన్ని, విగ్రహరూపంలో వున్న దేవున్ని మొక్కేకంటే సాటి మనిషికి సాయపడటం మంచిదన్నాడు. 'మనిషి చేసిన రాయి రప్ప'కు అని చెప్పిన గురజాడ అభిప్రాయాన్నే ఆనాడే బ్రహ్మంగారు. 'సాటి మానవునకు సాయమ్ము పడబోక' అన్న పంక్తిలో చెప్పాడు.

**ఆ. సాటి మానవునకు సాయమ్ము పడబోక**
**నల్లరాళ్ళు తెచ్చి గుళ్ళు కట్టి**
**మ్రొక్కులిడిన బ్రతుకు చక్కపడంబోదు**
**కాళికాంబ! హంస! కాళికాంబ!**

దాతృత్వం అనేది మానవుడికుండాల్సిన సహజగుణం. అది తెచ్చిపెట్టుకుంటే వచ్చేది కాదు. దానిద్వారా లభించే గౌరవం చచ్చాకా కూడా వెంటవస్తుంది. కారే రాజులు, రాజ్యముల్ గలుగవే – వారేరీ? మరిక మిగిలిందెవరు – శిబి ప్రముఖులైన దాతలే గదా! సిరి ఎవరూ మూటగట్టుకొనిపోరు. మిగిలేది మంచితనమే. అది పది మందికి సహాయపడే దానగుణమే. కావున మనిషి మానవత్వంతో దానం చేయాలని దాన గుణాన్ని అలవర్చుకోవాలని బ్రహ్మంగారు సూచించారు.

**ఆ. తనువు లస్థిరమని ధనము తా గాదని**
**ధర్మశీలు డగుచు తగిన పాటి**
**దానమిచ్చువాడె ధన్యాత్ముడిలలోన**
**కాళికాంబ! హంస! కాళికాంబ!**

మనిషి, తన శరీరం అశాశ్వతమైనదని, తాను ఈ నేలపై ఉండే సంపదను సృష్టించలేదని, తనవద్ద వున్న సొమ్ము తనది కాదని, దీన్ని పరులకు పంచి ఇవ్వడమే ధర్మమని, మానవతా భావనతో ఎవడైతే దానం చేస్తాడో వాడే ధన్యుడనీ, వాని జీవితమే ధన్యమైందని బ్రహ్మంగారు దానగుణంలోని సత్యాన్ని ఆవిష్కరించారు. మానవతతో పరులకు దానం చేయమని కవి ఆకాంక్ష. ఇలా కాళికాంబాసప్తశతిలో దానగుణ గొప్పతనాన్ని చెప్పే అనేక పద్యాలు మనకు కనిపిస్తాయి.

ప్రజా హితాన్ని కోరిన బ్రహ్మంగారు, ప్రజలను అశాంతికి, అసౌకర్యానికి గురిచేసే మత మౌఢ్యాన్ని తీవ్రంగా ఖండించాడు. ఏ మతమైనా ప్రజలకు హితాన్ని కల్గించాలి కాని ఇక్కట్లను తెచ్చిపెట్టరాదు. అన్ని మతాలు కూడా వ్యక్తుల మధ్య పరస్పర అవగాహనను పెంచి తమ ఆత్మ స్వరూపాన్ని తెలుసుకొనేందుకు సహకరించాలి కాని తారతమ్య భేదాలతో ప్రజలను అశాంతికి గురిచేయరాదు అన్నాడు బ్రహ్మంగారు.

**ఆ. మతము మత్తుగూర్చు మార్గమ్ము కారాదు**
**హితము గూర్చవలయు నెల్లరకును**
**హితము గూర్చలేని మతము మానగవలె**
**కాళికాంబ! హంస! కాళికాంబ!**

మతం మత్తుమందు లాంటిదని, మతం కంటే మానవతే మిన్న అనిన బ్రహ్మంగారు, ఆ మత భేదాల్లో, వాదాల్లో ఇమిడివున్న అజ్ఞానాన్ని బట్టబయలు చేశాడు. వారు ఒకరికొకరు ద్వేషించుకోవడాన్ని, సమాజాన్ని అశాంతి పరచడాన్ని ఖండించాడు.

**ఆ. మాకు మీకు గురుడు మాధవుడే కదా!**
**నిడివి అడ్డబొట్టు నిందయేమి?**
**మతము కల్పితమ్ము మార్గమొక్కటె గదా!**
**కాళికాంబ! హంస! కాళికాంబ!**

శివభక్తులు అడ్డనామాలు పెట్టుకుంటారు. విష్ణు భక్తులు నిలువునామాలు పెట్టుకుంటారు. ఈ నామధారణలో శైవ, వైష్ణవ భక్తులు విభేదించుకొని, ద్వేషించుకొని సమాజాన్ని అలజడికి గురిచేయడాన్ని బ్రహ్మంగారు తీవ్రంగా ఖండించారు. ఆ మత భేదాల్లోని, వాదాల్లోని అజ్ఞానాన్ని మత ఛాందసవాదాన్ని బట్టబయలు చేశాడు. అందరికి మాధవుడు ఒక్కడే గురువని, సర్వమానవులు సమానులని సర్వమానవ సమానత్వాన్ని, విశ్వమానవ సంక్షేమ దృష్టిలో చెప్పాడు. బ్రహ్మంగారు చెప్పిన ఈ సర్వమత సారాన్ని అందరూ గ్రహిస్తే సమాజం శాంతిమయంగా అభ్యుదయ మార్గంలో పయనిస్తుంది. సర్వజనులు సుఖమయ, ఆనందమయ జీవనాన్ని గడుపుతారు.

కృషితో నాస్తి దుర్భిక్షం. కృషి ఉంటే మనుషులు ఋషులవుతారు. సమసమాజ నిర్మాణం కావాలంటే, ఆర్థికంగా మనుషులందరూ స్వయం పోషకంగా బతకాలంటే మనిషి స్వయంకృషితో పురోభివృద్ధి చెందాలని సూచించాడు.

**ఆ. ప్రకృతి వికృతితత్వ పరిగణమ్ములో**
**కృషి యొనర్చువాడె ఋషి, మహర్షి**
**రెండు గాని వాడు రండముండల బిడ్డ**
**కాళికాంబ! హంస! కాళికాంబ!**

లోకంలో కొందరు ఎన్నో పనుల్ని ప్రారంభిస్తారు. ఆటంకాలు, అవరోధాలు ఏర్పడితే మధ్యలోనే నిష్క్రమిస్తారు. ఆ కార్యం ద్వారా ఎలాంటి ప్రయోజనాన్ని పొందలేరు. అలాంటివారు ఎప్పటికినీ ఏ కార్యంలోనూ సఫలీకృతులు కాలేరు. వారిని అభద్రతాభావం, తమ మీద తమకే నమ్మకం లేకపోవడం ఆవరిస్తాయి. జీవితం దుర్భరం అవుతుంది, అశాంతికి గురవుతాడు. దీనిద్వారా అతని కుటుంబం, సమాజం ఇలా సంఘం మొత్తానికి ప్రమాదం సంభవిస్తుంది. ఇలాంటి వారి గురించి, ఇలాంటి వారిని కార్యోన్ముఖుల్ని చేయడం గురించి బ్రహ్మన్న చేసిన కర్తవ్యబోధన చూడండి.

**ఆ. పట్టు పట్టనేని వీడగరాదు**
**పట్టు వదలెనేని పదవిలేదు**
**పట్టు విడుచుకంటె ప్రాణమ్ము లిడమేలు**
**కాళికాంబ! హంస! కాళికాంబ!**

ఒక పనిని ప్రారంభించి దాన్ని మధ్యలో వదిలిపెట్టడం మరణ సదృశమే అన్నాడు బ్రహ్మంగారు. స్వప్రేరణతో ప్రారంభించిన కార్యాలను విజయవంతంగా పూర్తి చేసుకోవాలని భావం. స్వయంకృషితో మానవాళి అభివృద్ధి పథంలో నడవాలని బ్రహ్మంగారు సూచించిన దీనిని మనం ప్రజాకర్తవ్యంగా భావించాలి.

నేటి సమాజంలో స్త్రీలపై ఎన్నో అకృత్యాలు, అఘాయిత్యాలు జరుగుతున్నాయి. నిర్భయలాంటి చట్టాలు తెచ్చినా ఆ దుస్సంఘటనల్ని ఆపలేకపోతున్నారు. మహిళలపై

చోటుచేసుకునే ఇలాంటి దురాగతాల్ని, అమానవీయ సంఘటనల్ని బ్రహ్మంగారు ఆనాడే ఖండించి స్త్రీలపట్ల పూజ్య భావాన్ని సంఘంలో కల్గించే ప్రయత్నం చేశాడు. స్త్రీ స్వాతంత్ర్యాన్ని సమర్థించాడు.

**ఆ. యౌవనమ్ము రాగ నజ్ఞాన మను తెర**
**కన్నులకు పొరగ గప్పితీరు**
**తెరలు పొరలు తెగిన పరనారి తల్లియౌ**
**కాళికాంబ! హంస! కాళికాంబ!**

సమాజంలో చాలామందికి కామంతో కళ్ళు మూసుకుపోయాయని, కామాంధకారంతో స్త్రీలపై ఎన్నో అఘాయిత్యాలకు, అమానవీయ చేష్టలకు పాల్పడుతున్నారని, అలాంటివారు కామాంధకార పొరను తొలగించుకొని చూస్తే పరస్త్రీ తల్లిగా కనిపిస్తుందని, పరస్త్రీ తల్లివంటిదని వారిపట్ల గౌరవభావంతో మెలగాలని బ్రహ్మంగారు స్త్రీలపట్ల గౌరవభావాన్ని ప్రకటించాడు.

ఆనాటి సమాజంలో కూడా స్త్రీలకు సరియైన గౌరవం లభించినట్లుగా లేదు. అందుకే బ్రహ్మంగారు దీనిని పోగొట్టాలనుకున్నాడు. స్త్రీకి సమాజంలో ఉన్నతస్థానం కల్పించాలనుకున్నాడు. పోలేరమ్మను కన్నబిడ్డగా గౌరవించిన బ్రహ్మంగారు స్త్రీ స్వాతంత్ర్యాన్ని, వారి ఔన్నత్యాన్ని బహుముఖాలుగా కీర్తించాడు. స్త్రీకి సమాజంలో గౌరవభావాన్ని తీసుకొచ్చే ప్రయత్నం చేశాడు.

**"సృష్టి కంతటికిని స్త్రీ ప్రధానము గదా"**
**"స్త్రీల మనసులోనే శివు నివాసమ్మగు"**

అంటూ సమాజంలో స్త్రీ గౌరవించబడాలనీ, కోరుకుంటూ, ఆదర్శ సమాజ నిర్మాణంవైపు, విలువలతో కూడిన సర్వమానవ సమాన సమాజంవైపు పయనించాడు బ్రహ్మంగారు.

మానవ మనో మర్మజ్ఞులైన బ్రహ్మంగారు కళ్ళముందు కదలాడే రకరకాల మనుషులనూ, మనస్తత్వాలను తూర్పారబట్టారు. ఇంద్రియాతీతమైన పరతత్వాన్ని పొరలు విప్పిచూపారు. మానసిక అశాంతికి గురైన మనుషుల మనసుల్లో ఆధ్యాత్మిక చైతన్యం ద్వారా శాంతి నెలకొల్పాడు.

**ఆ. బ్రహ్మ మనగ వేరె పరదేశమున లేదు**
**బ్రహ్మమనగ జూడు బట్టబయలు**
**తనకు తానె బ్రహ్మ తారక మౌనురా!**
**కాళికాంబ! హంస! కాళికాంబ!**

తన ఆత్మలోనే బ్రహ్మం కొలువుదీరియుండగ పరదేశంలో వెదకడం అజ్ఞానమన్నాడు. బ్రహ్మం పరదేశంలో లేదు, మరెక్కడో లేదు మనిషి యొక్క అంతరంగమందే ఉంది. ప్రతివాడిలోనూ బ్రహ్మం ఉంది. ఎవరికి వారే బ్రహ్మం అన్నాడు బ్రహ్మంగారు. అంటే మనిషి లోచూపు అలవర్చుకోవాలని, తన అంతరంగాన్ని దర్శించాలని తనను తాను తెలుసుకొని ఆత్మజ్ఞానం పొంది, అజ్ఞానాన్ని వదిలి, బ్రహ్మంను వెదకడంలోని భౌతిక కష్టాలను తొలగించుకొని శాంతిని పొంది సుఖమయ జీవనాన్ని, విలువలతో కూడిన ఆదర్శ జీవనాన్ని పొందాలని బ్రహ్మంగారి భావన.

**"జీవహింసచేత చిక్కునా మోక్షంబు"**
**"యాత్రలెల్ల వెదక నాత్మలో నుండగా"**
**"లోని శివుని జూడ బూనడు జడబుద్ధి"**

అంటూ మనిషిలోని అంతరంగాన్ని విశదీకరిస్తూ, ఆధ్యాత్మిక చైతన్యం ద్వారా సామాన్య మానవుల్ని చైతన్యవంతం చేశాడు బ్రహ్మంగారు.

సమాజ హితాన్ని కోరుకున్న బ్రహ్మంగారు, అందుకుపకరించే ఎన్నో లోకనీతుల్ని కూడా బోధించాడు.

**"నీతిరీతిలేక నైతిక పతితులై**
**నరులకుండు లక్షణములు మరిచి**
**క్రూర జంతువులుగ మారిపోయిరి జనుల్"**
**"మంచి చెడ్డలందు మరియాద విడకుండ**
**నడచుకవాడె జగతి నాణెకాడు**
**పొంగి కుంగుచుండు పోకిరి సన్నాసి"**

ఇలాంటి ఎన్నో లోకనీతులు కాళికాంబా సప్తశతి నిండా మనకు కనిపిస్తాయి. ఇవన్నీ కూడా మానవతా విలువలుగా ఆదర్శ సమాజ నిర్మాణంలో ఉపయోగపడతాయి.

ఈ విధంగా బ్రహ్మంగారు దీనజనుల పక్షాన మానవతా దృక్పథంతో కాళికాంబాసప్తసతిలో సాహిత్య సృజన సాగించాడు. తెలుగు సాహితీ చరిత్రలో బ్రహ్మంగారు వెదజల్లిన మానవతా పరిమళం నిరంతరం గుభాళిస్తూనే వుంటుంది. ఇక్కడ పేర్కొన్న మానవతా విలువలే కాకుండా ఇంకా ఎన్నో మానవతా విలువలు ఈ శతకంలో చాలా పద్యాల్లో అంతర్లీనంగా మనకు బోధపడతాయి.



## సొట్టబుగ్గలోడు

కె. విల్సన్‌రావు
8985435515



నల్లకోటేసుకున్న సొట్టబుగ్గల
సిన్నోడా..!
సహజ హక్కులనూ హరించే
మదపుటేనుగా..!!
సిగ్గూ, లజ్జా లేకుండా
రహస్యంగా ప్రపంచం మీదికొదిలిన
నీ బుల్డోజర్ మేనిఫెస్టోలన్నీ
ప్రజాగ్రహానికి ఆవిరై
బెంబేలెత్తి పోతుంటే
నీ బుల్లెట్ ప్రూఫు చూపుల్నింకా
సారిస్తానంటే ఎలా..?

మహా మహులే అక్షరానికి దాసోహమై
బతుకు పుస్తకాల్ని మూసేసి
గతంలోకి నిష్క్రమించారు
పేజీల్ని తిరగేసుకుంటూ..
నువ్వెంత..?

నువ్వేమైనా కాలపురుషుడివా..!
సాగిల పడే ఊసే లేదు..

మానవత్వం మహాకాశమై
పరిమళిస్తున్న పుష్పాలం
చైతన్య కాంతి ధారతో

చీకటి రెక్కల్ని విరిచి
వెలుగును పంచుతున్న
మానవతా కుసుమాలం
పచ్చని చిరునవ్వుల్తో
తెల్లని ఉషస్సుల్ని ధరించి
సరికొత్త స్వేచ్ఛా గీతాల్ని
ఆలపిస్తూ
ఖండాంతరాల్ని దాటి
చేతనాలోకంలోకి వస్తున్నాం

శాసనకర్తెపుడూ చమటోడుస్తూ
కాలంతో పరుగెడుతున్న ప్రతీక
పదహారణాల శ్రమసంగీతమై
పరవసించే జీవద్భాషే...



---

## కడలి పుత్రుల బతుకు 'పోరు'

కొలిపాక శ్రీనివాస్
9866514972

కోడి కూయక ముందే
పొద్దు పొడవక ముందే
మత్స్యకారుల జీవన 'నావ'
రాష్ట్రాలుదాటి, తీరం వెంబడి
బయలుదేరుతుంది.....
పరుగులు తీస్తూ.....!
ఈ కడలి పుత్రుల బతుకు పోరాటానికి
'వలలు' ఆయుధాలై.!
పడవలు తోడై.!
కడలి కెరటాలపై
పస్తులుతో
నకనకలాడే
ఆకలి పేగులకోసం యుద్ధం.!
ప్రకృతి కరుణిస్తేనే...? లేదంటే
మృత్యుద్వారాలై కాచుక్కూర్చునే
సుడి గుండాలు ఎన్నో!
రాకాసిలా విరుచుకుపడే



వాయుగుండాలు ఎన్నో!
నిత్యం చావు ఘడియలై
బెదిరిస్తాయి మరీ!
*
ఈ నిండు జీవితాలు
పద్మ వ్యూహంలోకి వెళ్లిన
అభిమన్యుడిలా మారతాయి మరీ?
ఈ పోరాటంలో

విజయ తీరాలకు
చేరాలంటే
చేప పడాలి.!
'వల' నవ్వాలి.!
*
ఇలా.....
సముద్ర కెరటాలపై
మత్స్యకారులు
'పెనుసవాళ్ల'ను
అధిగమించిన
వీరులు!
ధీరులు!
నిజంగా
మృత్యుంజయులు
వీరు!



# మార్పు

కె. ఉషారాణి
9492879210



నేను బందరు వచ్చి రెండు రోజులే అయ్యింది. హైదరాబాద్‌లోని ఓ జాతీయ బ్యాంకులో పనిచేస్తున్న నాకు పదోన్నతితో బందరు ట్రాన్స్‌ఫర్ చేసారు. మొన్న బ్యాంకులో చేరాను. నిన్న రామనాయుడుపేటలో ఇల్లు చూసుకుని ఇంట్లో చేరాను. ఇక వచ్చేవారం కుటుంబాన్ని అక్కడినుండి ఇక్కడికి మార్చాలి.

బందరు ఊరు చిన్నదే. ఇక్కడి ఉక్కపోత మాత్రం నన్ను ఉక్కిరిబిక్కిరి చేస్తోంది. హైదరాబాద్ వాతావరణానికి అలవాటుపడ్డ నాకు కొంత ఇబ్బందిగాను మరికొంత చికాకుగాను ఉంది. హు! అయినా తప్పదు కదా! ఉదరపోషణార్థం ఈ తిప్పలు భరించాల్సిందే! రాత్రి కొత్త ఇంట్లో నిద్ర చేసానన్నమాటే గాని నిద్ర సరిగా పట్టలేదు. కొన్ని సౌకర్యాలకు అలవాటు పడ్డ ప్రాణం కదా! ఎప్పుడూ లేనిది తెల్లవారకముందే లేచి కూచున్నాను. ప్రాతఃకాల ప్రశాంత వాతావరణం, పిల్లతెమ్మెరలు కాస్తంత శరీరానికి ఊరటనిస్తాయని వ్యాహ్యాళికి బయలుదేరాను. అదీకాక ఈరోజు ఇక షేవ్ చేయడం వాయిదా వేయలేమని గరకుగడ్డం గుర్తుచేస్తున్నది. వస్తూ వస్తూ ఆ పనీ ముగించుకోవచ్చు అనుకుని, కోనేటి సెంటరు చుట్టుప్రక్కల మంగలి షాపును వెతుక్కుంటూ ఉండగా 'మల్లన్న హెయిర్ కటింగ్' షాపు కనిపించింది. అప్పుడే తెరిచినట్టున్నాడు. ఇంకా సామానులు సర్దుకుంటున్నాడు ఓ నలభై ఏళ్ళు పైబడ్డ ఆసామి.

షాప్‌లో ఎదురుగా ఖాళీగా ఉన్న కుర్చీలో కూచున్నాను. రెండు నిముషాలలో పని ముగించుకుని నా కుర్చీ దగ్గరకు వచ్చి కుర్చీని తనవైపు తిప్పుకున్నాడు. ఆ వెనువెంటనే నా నోట మరోమాట వచ్చేలోగా నూనె తలమీద పెట్టడం, అనుభవం గల చేతులు నా తలపై సుతారంగా నాట్యం చేయడం మొదలెట్టాయి. మర్ధన చేస్తూనే...

"మీరు ఈ ఊరికి కొత్తనుకుంటా! ఏ ఊరునుండి వచ్చారు?" అని అడిగాడు. నోరు తెరవనిస్తేగా! నెమ్మదిగా దరువు వేగం పెరిగింది. మర్ధన స్వాంతనని నాకు తెలియకుండానే అనుభవించడం మొదలుపెట్టాను. ప్రశ్నకు సమాధానం కోసం ఎదురు చూడకుండానే ఆ ఆసామి మళ్ళీ...

"నా పేరు మల్లన్నండీ! ఈ ఊళ్ళో నాదే పెద్ద మంగలి షాపు. నా క్రింద ఇంకా ఇద్దరు కుర్రాళ్ళు ఉన్నారు. షాపు నా సొంతం. నేను నా పదిహేనవ ఏట ఈ షాప్‌లో అడుగుపెట్టాను. అప్పుడీ షాపు ఇలా లేదనుకోండి. చదువుకుంటానని ఎంత ఏడ్చినా మా నాన్న చదువేం తిండిపెడుతుందిరా ఈ షాపు నీకు తిండికి లోటు రానివ్వదంటూ ఇందులో దూర్చాడు. కాకపోతే ఇందులోనే ఉన్నందుకు నేనీ షాపును ఎప్పటికప్పుడు కాలానుగుణంగా మార్పులు చేసుకుంటూ వస్తున్నాను. కస్టమర్స్ అభిరుచులకనుగుణంగా కొత్త కొత్త క్రాఫ్‌లు చేయడం, జుత్తులకు రంగులు వేయడం, రకరకాల మసాజ్‌లు చేయడం అలవాటు చేసుకున్నాను. తలపై దరువు నెమ్మది నెమ్మదిగా తగ్గుతూ ఆగింది. నేను కళ్ళు తెరిచి మల్లన్నవైపు చూసాను.



"క్రాఫ్ చేసేంత జుత్తు పెరగలేదే! క్రాఫ్ చేయమంటారా?

''కాదు మల్లన్నా! నేను వచ్చింది షేవ్ చేయించుకునేందుకు. ఈ మధ్యనే హైదరాబాద్ నుండి బదిలీ అయి వచ్చాను. బ్యాంకు మేనేజర్‌ని. మా బ్యాంకు కూడా ఈ ప్రక్కనే ఉంది."

"ఓ అయితే షేవ్ చేయాలా!"

వెంటనే ఓ బరువయిన దుప్పటి నా రెండు భుజాలపై వాలింది. షేవింగ్ క్రీమ్‌తో నిండిన బ్రష్ చకచకా నా బుగ్గలపై అటు ఇటూ పరుగులెత్తి నురగతో నింపింది. అంతటితో ఆగక నా కనురెప్పలనూ తాకింది. అసంకల్పితంగా వాటిని తుడుచుకునేందుకు చేతులు పైకి లేపే ప్రయత్నం చేసినా దుప్పటి వాటికా అవకాశం ఇవ్వలేదు. ఇంతలో మల్లన్నే జాగ్రత్తగా తుడిచాడు. నురుగు నోటిపై దాడిచేసినా లోపలికి వెళ్లకుండా పెదవులు గట్టిగా బిగబట్టి ఆపగలిగాను.

ఓసారి గొంతు సవరించుకుని మల్లన్న మళ్ళీ మొదలెట్టాడు.

"ఈ మధ్య ఓ గమ్మత్తు జరిగింది. మా ఊళ్ళో రాజుపేటని ఉంది. ఓ రోజు రాత్రి ఎనిమిది గంటలు కావస్తున్నది. అందరూ కొట్లు కట్టేసే వేళ అది. నేనూ ఆ ప్రయత్నంలో ఉన్నాను. పైగా చిన్న తుంపర మొదలయ్యింది నాకు ఆకలి కూడా వేస్తున్నింది. కొట్టు కట్టి గబగబా ఇంటికెళ్ళి ఓ ముద్దతిని హాయిగా నడుం వాల్చాలనుకుంటుండగా ఓ ఫోన్ వచ్చింది. నా పాత కస్టమరే. రాజుపేటలో తనున్న ఇంట్లో ఒక పోర్షనులో ఒకాయన 'ఇప్పుడే పోయాడు. వెంటనే షేవ్ చేయాలి' అంటూ. శవాలకు షేవ్ చేయడం ఎవరికి ఇష్టం ఉంటుంది. పైగా ఈ వేళగాని వేళలో. అయినా ఆయన బతిమాలడం ఆపలేదు. నాకు సరే అనక తప్పలేదు. పెట్టె పుచ్చుకు బయలు దేరాను. వాకిట్లోనే ఆయన కనిపించి..

"లోపలకి వెళ్ళు. రెండో పోర్షన్. ఎవరూ లేరు. నీ పని ముగించుకు రా. నేను డబ్బులిస్తా. ఇంకా రావల్సిన వాళ్లు రాలేదు. నేను ఇక్కడ వారికోసం ఎదురుచూస్తున్నాను" అన్నాడు.

సరేనని నేను రెండో పోర్షన్‌లోకి వెళ్ళాను. మంచంపై మనిషి పడుకున్నట్టే ఉన్నాడు. శరీరం ఇంకా వెచ్చగానే ఉంది. సాధారణంగా శవాలు చల్లగా గట్టిగా ఉండి షేవ్ చేయడం కష్టం. కాని ఇక్కడ నా పని సులభంగా ముగిసింది. పెట్టె పట్టుకుని బయటకు వచ్చి నాకు రావలసిన డబ్బులు తీసుకుని ఇంటిదారి పట్టాను.

ఇక్కడి వరకు చెప్పి నవ్వడం మొదలెట్టాడు. కాసేపటికి నవ్వాపాడు. ఈ సారి కళ్ళతోనే నవ్వుకి కారణం అడిగాను.

మల్లన్న మొదలెట్టాడు.

"రెండోరోజు తెలిసినదేమిటంటే నేను గడ్డం చేసింది చనిపోయినాయనకు కాదు. అప్పటికి ఆయన బ్రతికే ఉన్నాడు. అయితే అక్కడో పొరపాటు జరిగింది. నేను గడ్డం చేసిన ఇంటి పక్కనున్నాయన ఆ రోజు సాయంత్రం విషం తాగాడు. స్పృహ లేకుండా ఉన్న ఆయన చనిపోయాడుకుని నాకు కబురు చేసారు. నాలుగు పోర్షన్‌లు ఉన్న ఆ కాంపౌండ్‌లో ఇది కుడివైపు నుండి రెండో ఇల్లు. కాని ఆ రోజే ఎడం వైపు నుండి రెండో ఇంట్లోని ఆయనకు గుండె జబ్బు వచ్చింది. ఆయన కోసం డాక్టరుకు కబురు చేసారు. ఆయన ఇంట్లోనూ ఎవరూ లేరు. సెలవలకు వాళ్ళ పల్లెకు వెళ్ళారు. నేను, డాక్టరు తారుమారయ్యాం. నేను వెళ్ళాల్సిన ఆయన దగ్గరకి డాక్టరు, డాక్టరు వెళ్ళాల్సిన ఆయన దగ్గరకు నేను వెళ్ళాం. కాని స్పృహ మాత్రమే పోయినందువలన ఆయన విషాన్ని కక్కించాడు డాక్టరు గారు. కడుపు ఖాళీ ఆయి ఆ మనిషి మళ్ళీ స్పృహలోకి వచ్చాడు. కాని నేను గుండె జబ్బు మనిషికి గడ్డం చేసి

వచ్చాను. ఫలితం మీరు ఊహించగలరు కదా!"

మల్లన్న కత్తి తనపని తాను చేసుకుపోతూనే ఉంది. మాటలలో పడి గాటు పడుతుందేమో అని అనుమానిస్తున్న నన్ను ఆయన అనుభవం వెక్కిరించింది.



మల్లన్న నవ్వినా మొహంలో ఒక రకమయిన నిర్వేదం, పశ్చాతాపం కనిపించాయి. కాసేపు మౌనంగా ఉండి మల్లన్న తిరిగి ప్రారంభించాడు.

"మా నాన్న చేసిన తప్పు నేను చేయకూడదనుకున్నాను. అందుకే నా కొడుకులిద్దరిని చదివించాను. పెద్దవాడు ఇక్కడే బిటెక్ పూర్తిచేసాడు. ఉద్యోగ ప్రయత్నంలో ఉన్నాడు. చిన్నవాడు బాగా తెలివైన వాడు. ఇంటర్‌లో జిల్లాలోనే ఫస్ట్ వచ్చాడు. ఎమ్‌సెట్‌లో కూడా మంచి రేంక్ వచ్చింది. రేపు కౌన్సిలింగ్‌లో సీట్ గ్యారంటీ అంటున్నారు తెలిసిన వారంతా. కాని మొన్న ఫీజుల సంగతి కనుక్కుంటే నాకు అయోమయంగా ఉంది. నేనెలా అందుకోవాలో తెలియడం లేదు. అదే మా బామ్మర్దితో అంటే, బ్యాంకులు అప్పులిస్తాయి. దిగులు పడకు అన్నాడు. నిజమేనాండీ?" అని అడిగాడు.

ఒక్క క్షణం నేనేం మాట్లాడలేకపోయాను. బ్యాంకులు చదువుకోసం అప్పులిచ్చేమాట నిజమే. కాని కొన్ని షరతులకు లోబడి ఇస్తాయి. మల్లన్న దగ్గర ఐ.టి. రిటన్స్ లేవు. ఉండే అవకాశమే లేదు. అప్పు పూర్తిగా తీర్చగల హామీ దారుడు కావాలి. ఆ స్తోమత ఉన్నవాళ్లు మల్లన్నకి ఎవరున్నారు? హామీ పత్రాలపై సంతకాలు చేసే అర్హులు మల్లన్న దగ్గరి వాళ్ళు ఎవరున్నారు. పోనీ మల్లన్నకు అంత విలువ చేసే ఆస్తులున్నాయా? అదీ లేదు. ఈ షాపు తప్ప ఆస్తులు లేవు. ఈ షాపుకు అంత మార్కెట్ విలువ లేదు. మల్లన్నకు ఈ షాప్ కోసం అప్పు కావలసి వస్తే నేనివ్వగలను. కాని మల్లన్న తన పిల్లల భవిష్యత్ కోసం కలగంటున్నాడు. ఆ కలలు నిజం చేయాలన్న ఆసక్తి నాకున్నా నా పరిమితులు నాకు బంధాలుగా ఉన్నాయి.

అందరికీ చదువుకునే హక్కుంది! దానికో ఆర్థిక చక్రబంధం ఉంది!! ఆశగా నా వైపే చూస్తున్న మల్లన్న కళ్ళనుండి నా చూపులు తప్పించాను. ఎదుర్కోలేక. రాని చిరునవ్వుని పెదాలపైకి తెప్పించి "చూద్దాం మల్లన్నా" అంటూ డబ్బులు చెల్లించి షాప్ బయట అడుగు పెట్టాను.

సూర్యుడు నెమ్మదిగా పైకెగబాకుతున్నాడు. ప్రపంచాన్ని నిద్ర లేపుతున్నాడు. బజార్లలో రణగొణ ధ్వనులు మొదలయ్యాయి. గాలి వేడెక్కుతున్నది. మళ్ళీ ఉక్కపోత మొదలయ్యింది. ఆఫీసు గుర్తొచ్చింది. పరుగులాంటి నడకతో ఇంటిమొఖం పట్టాను.

నడక కన్నా వేగంగా మల్లన్న చూపులు నా మస్తిష్కాన్ని వెన్నాడుతున్నాయి. మల్లన్న ఆవేదన నాకర్థం అయ్యింది. ఇన్నాళ్ళు మంగలి వాళ్ళకు షాపు పెట్టుకునేందుకు అప్పులిచ్చినందుకు నేను గర్వపడేవాడిని. పెట్టె పుచ్చుకు తిరిగే వాడికి నిలకడైన నీడ కల్పించామనుకునే వాడిని. నా ఆలోచనలు ఎంత తప్పో నాకీరోజు అర్థం అయింది. మంగలివారు ఆ వృత్తిలోనే ఎదగాలనుకోవడం ఎంత తప్పు! మంగలివారికి ఆ వృత్తే ఎందుకు నచ్చాలి? మల్లన్న పిల్లలను తన వృత్తే అంటగట్టాలనుకోకుండా వారికి నచ్చిన వృత్తులను ఎంచుకునే స్వేచ్ఛ నిచ్చి ఎంత ఉదాత్తంగా ఆలోచించాడు? ఇంత చదువుకున్న నేను వృత్తులు వ్యక్తుల అభిరుచుల కనుగుణంగా ఉండాలని అనుకోలేకపోయాను.

అంటరాని వృత్తి నుండి బయటకి సమాజంలో గౌరవంగా పరిగణించబడే వృత్తిలోకి తన పిల్లలు, తన తరవాతి తరం, ముందుకు సాగాలనుకోవడం ఎంత సమంజసం! ప్రగతిశీలంగా ఆలోచిస్తాననుకునే నాకే ఇంత సనాతన భావాలున్నందుకు సిగ్గనిపించింది. ఈ వివక్షలో ఇమిడి ఉన్నది ఆర్థికాంశమే కాదు. సామాజికాంశం కూడా. ముందు ప్రతి వ్యక్తికీ తన కిష్టమయిన వృత్తిని, అందుకవసరమైన చదువును అందిపుచ్చుకునే అవకాశాలు ఉండాలని సమాజం నమ్మాలి. నేను నమ్మాలి. ఇక అప్పుడు అర్థికంగా ఆదుకునే మార్గాలు వెదకాలి. రేపు మల్లన్నని బ్యాంకుకు రమ్మనాలి. ఒప్పించాల్సిన వారినందరినీ ఒప్పించి మల్లన్న కొడుకుకు బ్యాంకు ఆర్థిక సహాయం చేసేటట్టు చూడాలి. ఇప్పుడు నాకు ప్రశాంతంగా ఉంది.



# అవును! పుత్ర వ్యామోహం ఒక వ్యాధి

- డాక్టర్ కత్తి పద్మారావు
9849741695

అంతస్థులు పెరుగుతున్నాయి
అద్దాల కిటికీలు...
జింకను వేటాడుతున్న పులి బొమ్మ
ఆమె హాల్లో ఊగుతున్న ఊయలలో
కాళ్ళు ఆమె పెంపుడు కుక్క తలదాక వెళ్ళివస్తున్నాయి
వంట గదిలో మాంసం వేగుతోంది.
వంట మనిషి కుక్కలకి ఉడికీ ఉడకని మాంసం వేస్తుంది.
కుండీలో ఉన్న మొక్కలు వాడిపోతున్నాయి.
వారి ఉదరాలన్నీ పెరిగి ఉన్నాయి
వారెందుకు వికృతంగా ఉన్నారు
ఫ్రిజ్‌లో బీరు సీసాలతో పాటు
ఓడ్కా, విస్కీ మూలుగుతున్నాయి.
సిగరెట్లు తాగి తాగి వారి పెదాల్లో
ఉన్న ఎరుపు మాయమవుతోంది.
అవును! ఏ సంపద సృష్టించినా
పుత్రికా, పుత్రులకేగా!
సున్నితమైన భావాలన్నీ
ఎక్కడ ధ్వంసం అవుతున్నాయి?
అవును! ఆ పబ్బుల్లో ఎగిరి ఎగిరి
అర్ధరాత్రికి సొషబోయిన ఆ పిల్లను
డ్రైవర్ భుజం మీద వేసుకెళుతున్నాడు
మత్తులో కెళ్ళాక లింగభేదం ఏముంది?
అవును! ఎవరు వీరు!
వీరి తల్లిదండ్రులు కోట్లకు పడగలెత్తారు
బ్యాంకులకు అప్పులు ఎగ్గొట్టారు
ఎందరో పేదల భూములు ఆక్రమించారు
వీరి ఇళ్ళల్లో ఎనిమిది కారులుంటాయి
ఏ కారులో ఎవరెళతారో తెలియదు
లావాదేవీలన్నీ కార్లలోనే జరుగుతాయి
ఇంతకీ ఈ సంపాదించే ధనంతో వీరు ఏం సాధిస్తున్నారు
ఆ కింగ్‌ఫిషర్ అధినేత బ్యాంక్ మేనేజర్లను
మందు సముద్రాల్లో ముంచేసి వేలకోట్లు ఎగవేసి
దేశాలను దాటివెళ్ళి దాక్కునాడు కదా!




కొడుకుల కోసం, కూతుళ్ళ కోసం
ఇంత దోపిడీలు చేయాలా?
బ్రతికుండగానే మరణించాలా?
ఆ అడవులన్నీ ఎడారులవుతున్నాయి
సూర్యుడు భూమిని తాకుతున్నాడు
మనిషి తేమలేని కిరణాలను
భరించలేకపోతున్నాడు
నదులు ఎండిపోతున్నాయి
నేలపొరలు పెరపెరలాడుతున్నాయి
చంటి పిల్లలు తల్లి పొత్తిళ్ళలో
ఆహ్లాదాన్ని పొందలేకపోతున్నారు
పరీక్షలు రాసే విద్యార్థుల బెంచీలు కాలిపోతున్నాయి
పెన్ను ఇంక్ బాయిల్ అవుతుంది
విద్యార్థి దాహార్తి తీర్చే కూజా కూడా ఒట్టిపోయింది
అక్షరం ఓడిపోయింది
నిజాయితీ డొల్ల అవుతుంది, నీతికి చోటులేదు
అంకెల గారడీతో ర్యాంకులు...
బుర్రలేనివారి ఆధిపత్యం?
ఓడిన అమ్మాయి ఆత్మహత్య!
విద్యాధికారులు కార్పోరేట్‌లకు అమ్ముడవుతున్నారు
అక్షరాన్ని కుదువకట్టు పెడుతున్నారు
పితృవ్యామోహం ఒక వ్యాధి
అవును! మనిషి మనిషిగా జీవించాల్సి ఉంది
చెట్టు ఏపుగా పెరగాల్సి ఉంది
నదులు అన్ని కాలాల్లో ప్రవహించాల్సి ఉంది
మానవత్వ పరిమళాలు గుభాళించాలి!
నీతి, నిజాయితిగా జీవించడమే ఉషస్సు..





# తెలుగు కథ - చాకలి చైతన్యం

పి. దస్తగిరి
8985095506

*భారతదేశంలోని చాతుర్వర్ణ వ్యవస్థలో అగ్రవర్ణాల కబంధ హస్తాల్లో చిక్కుకొని ఉక్కిరిబిక్కిరి అవుతున్న అట్టడుగు కులాలు, వృత్తులు గురించిన కథలు మనకు చాలానే వచ్చాయి. అయితే, బి.సి. వర్గంలో అట్టడుగున ఉంటూ, అనాదిగా మురికిని శుభ్రపరుస్తూ జీవితాలను వెళ్ళదీస్తున్న చాకళ్ళ గురించి వచ్చిన కథలు తక్కువే అని చెప్పొచ్చు. అంతా బి.సి. వర్గమే అయినప్పటికీ వారంతా సమానంగా లేరు. ఆర్థిక, రాజకీయ, సాంఘిక అసమానతలు చాలా ఉన్నాయి. అందులో అట్టడుగుకు నెట్టివేయబడిన బలహీన వర్గమే చాకలి.*

ఆంగ్లసాహిత్య ప్రభావంతో మొదలయిన మన ఆధునిక తెలుగు కథ మొదట్నుంచీ సమాజంలోని ఎన్నో సమస్యలను చిత్రిస్తూ వస్తోంది. వాటి పరిష్కార మార్గాలను చూపుతూ ఉంది. ఈ క్రమంలోనే కులం, దాన్ని అంటిపెట్టుకొని ఉన్న వృత్తిని వస్తువుగా గ్రహించి ఎన్నో కథలు మనముందుకు వచ్చాయి. భారతదేశంలోని చాతుర్వర్ణ వ్యవస్థలో అగ్రవర్ణాల కబంధ హస్తాల్లో చిక్కుకొని ఉక్కిరిబిక్కిరి అవుతున్న అట్టడుగు కులాలు, వృత్తులు గురించిన కథలు మనకు చాలానే వచ్చాయి. అయితే, బి.సి. వర్గంలో అట్టడుగున ఉంటూ, అనాదిగా మురికిని శుభ్రపరుస్తూ జీవితాలను వెళ్ళదీస్తున్న చాకళ్ళ గురించి వచ్చిన కథలు తక్కువే అని చెప్పొచ్చు. అంతా బి.సి. వర్గమే అయినప్పటికీ వారంతా సమానంగా లేరు. ఆర్థిక, రాజకీయ, సాంఘిక అసమానతలు చాలా ఉన్నాయి.

అందులో అట్టడుగుకు నెట్టివేయబడిన బలహీన వర్గమే చాకలి. వీరిది మన సమాజంలో ప్రధానమైన పాత్ర. నిత్యం రేవులో బండచాకిరీ చేస్తున్నా బాగుపడని జీవితాలు చాకలివారివి. పైగా అగ్రవర్ణాల అదిరింపులు, బెదిరింపులు, చీవాట్లు, చీదరింపులు. కులానికి, వృత్తికి ఉన్న సంబంధాలు సడలిపోతున్నా చాకలిపని చేయాల్సిందేనని పెత్తందార్ల, బూర్జువావర్గ దాడులు, దౌర్జన్యాలు ఇంకా కొన్ని ప్రాంతాల్లో సాగుతున్న మాట నిజం. ఇందులో తమ మాన, ప్రాణాలను కూడా ఒక్కోసారి చాకలివారు కోల్పోతున్నారు. వృత్తితో సరైన సామాజిక గౌరవంలేక ఎన్నో అవమానాలకు గురవుతున్నారు. అయితే, ఇప్పుడిప్పుడే కాలం మార్పువల్ల కొంత చైతన్యాన్ని తెచ్చుకొని సమాజంలో ముందడుగు వేస్తున్నారు. ఆ మార్పుకు కారణం ఆధునికతతోపాటు, సాహిత్యం ఇస్తున్న ఉత్సాహం కూడా కారణం.

నలిగిపోతున్న బడుగు బలహీన చాకలివర్గ ప్రజల స్థితిగతుల్ని ఆలోచించండి అంటూ కొందరు రచయితలు సహృదయస్పందనతో రాసిన కథలు మనల్ని ఆలోచింపచేస్తాయి. సమాజం మారాలనే కాంక్షను మనలో మొలకెత్తిస్తాయి. అలాంటి కథలురాసిన వారిలో కాలువ

మల్లయ్య, గంటేడ గౌరునాయుడు, సదానంద శారద, పెద్దింటి అశోక్ కుమార్, కొలకలూరి ఇనాక్, వింజమూరి మస్తాన్ బాబువంటి వారిని పేర్కొనాలి.



అణగారిన వర్గాలమీద అధికారాన్ని చెలాయించే బూర్జువాతత్వాన్ని తన గుండెధైర్యంతో ఎదిరించిన చాకలి వీరయ్య కథ **కాలువ మల్లయ్య** రాసిన **"ధిక్కారం"**.(1989)

వీరయ్య తాను ఇష్టపడ్డ రాజమ్మతో తొందరపడటంవల్ల ఆమె గర్భవతి అవుతుంది. దాన్ని తప్పుగా పరిగణించి పంచాయతీ పెదతారు ఊరి పెత్తందార్లు. చేసిన తప్పుకు వెయ్యి రూపాయలు 'దండుగ' కట్టమంటారు. అప్పుడు వీరయ్య "తప్పుకు దండుగుంటది నిజమే. కని ఎవల్జేసినా ఉంటదా ఒక్క సాకలోల్లకేనా?'' అని ఏమాత్రం తొణుకుబెణుకు లేకుండా ప్రశ్నిస్తాడు. అంతేకాదు, "నాకంటే ముందు తప్పు చేసినోల్ల దగ్గర ముందు దండుగ వసూలు చేయండి ఆ తరువాతే నా సంగతి" అని సర్పంచ్, పంచాయతీ పెద్దలు చేసిన తప్పుల్ని మర్మంగా ఎత్తిచూపుతూ వారిని పరోక్షంగా ముద్దాయిల్ని చేస్తాడు. అక్షరజ్ఞానంలేని 25ఏళ్ళ వీరయ్య మాటలధాటికి పంచాయతీ పెద్దలకు ముచ్చెమటలు పడతాయి. పంచాయతీ పెద్దలు, వారిపిల్లలు ఎవరెవర్ని చెడగొట్టారో, ఎంతమంది శ్రామిక కులాల ఆడపిల్లల్ని చెరబట్టారో అందరిముందు బహిర్గతంచేస్తూ ఉతికి ఆరేస్తాడు. అయినా తాను రాజమ్మను పెళ్ళి చేసుకుంటానని, అది ఆమెకు కూడా సమ్మతమేనని చెప్పినా తమని పంచాయతీలో నిలబెట్టినందుకు కోపోద్రిక్తుడవుతాడు. "మీ దాంట్ల ఒక్క పెండ్లంతోనే సంసారం జేసేటోల్లెంత మందున్నరో సెప్పుంర్డి. వేరే ఆడదానితోని సంబంధం అసలు లేనోల్లెవ్వలో నా ముందుకు రాంర్డి. మీ జాతకాలన్నిప్పమంటారా?" అని సవాలుచేస్తూ నిప్పులు చెరుగుతాడు. ఇలాకాదని పంచాయతీ పెద్దలు వారి చేతులు వాళ్ళ నెత్తిపైనే పెట్టాలని కుటిలనీతి ప్రదర్శించి ఊరికి ఉన్న కట్టుబాట్ల పేరుతో "అరేయ్ మడేలు బాలయ్య! అరేయ్ కర్రెమల్లు! మీవోడు నోటికచ్చినట్లు మాట్లాడుతుండు. అన్ని మీరే సముజాయించుంర్డి" అని కులపెద్దలకు చెప్పి రాజకీయం చేస్తారు. దాంతో కులపెద్దలు అనాదిగా వస్తున్న బానిసత్వభావనతో వీరయ్యను పంచాయతీ పెద్దలు చెప్పినట్లు వినమని విఫలయత్నం చేస్తారు. అక్కడ కూడా తామెట్లా అగ్రవర్ణాలచేతుల్లో ఆత్మాభిమానాన్ని చంపుకొని బతుకుతున్నారో బాధగా, కోపంగా చెప్పి కులపెద్దల్ని ఆలోచింపచేస్తాడు వీరయ్య.

"తప్పు తప్పే. వెయ్యి రూపాయలు దండుగ్గట్టి లగ్గం జేసుకో" అన్న రాజిరెడ్డి మాటలకు "ఈ పైసలు ఏం జేత్తరు?" అని నేరుగా అడుగుతాడు వీరయ్య. దండుగులని, జరిమానాలని

అమానుషంగా వసూలుచేసిన డబ్బుతో జల్సాలాడే పంచాయతీ పెద్దల పనికిమాలినతనాన్ని అందరిముందు పటాపంచలు చేస్తాడు.

చివరికి సర్పంచ్ తాము చెప్పినట్లు వినకపోతే ఊర్లో ఉండటమే కష్టమవుతుంది. అన్నిటినీ బంద్ చేస్తామని బెదిరించినపుడు "ఇగొ గీ రెక్కలు సల్లగుంటె మాకే ఊరయినా ఒక్కటే. గీ ఊల్లెనె బతుకన్ననేం లేదు, ఎక్కడిక పోయినా కట్టంజేసుకొని బతుకుత" అని శ్రామికతత్వపు ధీమాని వ్యక్తం చేస్తాడు వీరయ్య. అంతేకాదు "రాజమ్మనిపుడే గుల్లె లగ్గం జేసుకుంట. దండుగ దండుగంర్టుండు గద, ఇగొ గీ పదిరూపాయలున్నయి తీసుకోంర్డి" అని ముష్టివేసి గద్దెపై పెద్దలను ధిక్కరించి గంభీరంగా, ఠీవిగా ముందుకు అడుగేస్తాడు. ఇక్కడ వీరయ్య పెళ్ళికి ముందు పొరపాటు చేసినా, ఆమెను భార్యగా చేసుకొనేందుకు సిద్ధపడే చేశాడు. అందుకే ధైర్యంగా తప్పును ఒప్పుకున్నాడు. ఆ తప్పును వేలెత్తిచూపే తప్పుడు మనుషుల్ని ఎదిరించాడు. తన శక్తిపై ధీమా ఉంది కాబట్టి తన బ్రతుకు విషయంలో ఇతరుల పెత్తనం విషయంతో రాజీపడలేదు.

భూగర్భంలో ఎంతోకాలంనుంచి అణచబడి, ఒక్కసారి పెల్లుబికిన లావాలాగా చాకలి సిమ్మడు బూర్జువాతత్వంపై విరుచుకుపడే కథ **గంటేడ గౌరునాయుడు** రాసిన **"విముక్తి"**. (1989)

సిమ్మడు, అప్పిలి ఇద్దరూ అలుపంటే ఏంటో తెలియకుండా చాకలిపని చేసుకునే చక్కనిజంట. ఒకరోజు ఉన్నట్టుండి అప్పిలి మంచంపడుతుంది. ఎప్పుడో సంవత్సరానికి ఒకసారి కాపులు ఇచ్చే జీతానికి కాకుండా జతకింత డబ్బులు ఇచ్చేట్లు మాట్లాడమంటుంది. ఆ మాట ఎందుకు చెప్పిందో గ్రహించలేని సిమ్మడు కులవృత్తిని మానేస్తే ఎలాగ అని అనుకుంటూ రేవులో ఒక్కడే ఆలోచనతో

వనిచేసుకుంటుంటాడు. చుట్ట కాల్చుకోడానికి వచ్చిన రైతు అప్పలసామి అప్పిలి ఆరోగ్యం గురించి అడిగి, మందులిప్పివ్వమని ఉచితసలహా ఇస్తాడు. సిమ్మడు సొంతమనిషిలా భావించి అతనితో తన బాధను పంచుకుంటూ "మందిప్పించడానికి నా దగ్గరేటున్నాది. నీకాడ నాకాడ పదిరూకలు తీసుకొని పంతులు బావుకి బతిమాల్తే ఇండీసను సేసినాడు నిన్న. నాయుడు బావుకి జీతమడిగితే ఆ బావుకెంతొచ్చిందంతావు. వుంచుకుంటాడు గావాల వుంచుకోని. సిన్న కూతురు సమర్తాడినప్పుడు మూలపోసిన దాన్నిము పుంచుకుంటాడు గాదూ. వుంచుకోనీ...వుంచుకోనీ మేడలు కట్టీని" అని రెక్కలు ముక్కలు చేసుకొని పడ్డ కష్టానికి దక్కని శ్రమఫలితం గురించి బాధతో అంటాడు. ఈ విషయాన్ని నాయుడుకు ముట్టిస్తాడు అప్పలసామి. దాంతో అహం దెబ్బతిన్న నాయుడు సిమ్మడ్ని పిలిపించి స్థంభానికి కట్టేసి రక్తం గూడు కట్టేలా కొడతాడు. ".....సాకల్లంజికొడకా!" అని పచ్చిబూతులు తిడుతూ "ఒరే రేవులో నీవు పారీసిన బట్టలు, అమ్ముకున్న సీరలు అన్నిటికీ రేటు కడితే నీ జీతానికి సరిపోతాయి. ఎల్లు...ఎ్రా...ఎవుల్తో సెప్పుకుంటావో" అని తన అహంకారపు విశ్వరూపాన్ని ప్రదర్శించి సిమ్మడి కట్లు విప్పదీస్తాడు. అప్పటిదాకా కొన్ని తరాలపాటు ఓర్పుగా అణకువగా ఉన్న సిమ్మడిలోని అణచబడ్డతత్వం కట్టలు తెంచుకుంటుంది. అంతే, ఒక్క ఉదుటున నాయుడిపై సివంగిలా విరుచుకుపడతాడు. అక్కడున్న వాళ్ళంతా విస్తుపోయేటట్లు నాయుడి చేతిలోని కర్రలాక్కొని ప్రళయకాల రుద్రుడే అవుతాడు సిమ్మడు. అక్కడున్నవాళ్ళంతా తేరుకునేసరికి నాయుడి చొక్కా చిరిగి వీపు ఎర్రగా కుదుములు కడుతుంది.

"ఇన్నాళ్ళూ మీ ఆడోళ్ళ మైల గుడ్డలు పులిమి, మీ పిల్లల సమర్త కవుర్లు సెప్పి, అరిసెలు, కావుళ్ళు మోసి, మీ సావులకి 'కాష్టం'పేర్చి, మీ బాడి నరకమంతా సేసినందుకు మా మంచి బవుమతే యిచ్చినారు...సాకలోడంతే మీకు 'యీక'నాగ కనబడుతన్నాడా? రండి ఎవులొత్తారో రండి" అంటూ కర్రను చేతబట్టుకుని కళ్ళలో నిప్పులు చెరుగుతూ నిలబడతాడు సిమ్మడు.

అగ్రవర్ణ అహంకారాన్ని, అధికారాన్ని ధ్వంసం చేసిన ఆనందాన్ని అప్పిలితో పంచుకుంటాడు సిమ్మడు. దాంతో



అప్పిలి "ఆ రోజు నాయుడు....నా ఒంటిమీద సెయ్యేసినందుకు ఇప్పుడు తగిన శాస్తి జరిగింది" అని మనసులో అనుకుంటుంది. శారీరకంగా, ఆర్థికంగా, మానసికంగా తమవర్గంపై జరుగుతున్న దోపిడీకి సిమ్మడు తన తెగింపుతో విముక్తి కలిగిస్తాడు.

ఏ స్త్రీ అయితే కులహంకారంతో చాకలి కులాన్ని చిన్నచూపు చూస్తుందో, అదే స్త్రీ చాకలికులం మూలంగా తన మానాన్ని, భర్త ప్రాణాన్ని నిలబెట్టుకోవడాన్ని తెలిపే కథ **సదానంద శారద** రాసిన **"బలం"**. (1978)

రెడ్డి కుటుంబాలు ఎక్కువగా వున్న ఆ ఊరిలో తక్కువ పొలం కలిగివున్న కుటుంబం రామిరెడ్డి, నీలవేణిలది. నీలవేణి తన పిల్లలు చాకలిపిల్లలతో ఆడుకుటుంటే 'ఆడుకోవడానికి ఎవరూ దొరకలేదా? ఆ చాకలిపిల్లలతో ఆడుతున్నావా....ఇంకోసారి ఆడుతావా? చాకలి ఇండ్లకు పోతావా చెప్పు' అంటూ చేయి చేసుకుంటుంది. అంతేకాదు, తక్కువజాతి ఇండ్లకు వెళ్లావో వీపు చీరేస్తా నని భయంపెడుతుంది.

నూరెకరాల ఆసామిగా ఉంటూ ఊర్లోని మిగతా కుటుంబాలవారినంతా క్రిమికీటకాల్లాగా చూసే నరసింహారెడ్డి కంట్లో పడుతుంది నీలవేణి. అవకాశంకోసం కాసుక్కూచ్చోనున్న నరసింహారెడ్డికి పొలం తగాదా రూపంలో ఆ అవకాశం వస్తుంది. దౌర్జన్యంగా చాలాసేపటినుండి పొలానికి నీరుపారగడుతున్న నరసింహారెడ్డి పాలేరును తన పొలానికి నీరు వదలమని రామిరెడ్డి బ్రతిమాలినా వినకపోగా, బెదిరించడంతో చేయిచేసుకుంటాడు. ఆ విషయం తెలిసిన నరసింహారెడ్డి రామిరెడ్డిని కాళ్ళుచేతులు కట్టేయించి, అతని భార్య నీలవేణిని నట్టినడివీధిలో బలాత్కారం చేయబోతాడు. ఆ సమయంలో సాటికులస్తులు మౌనంవహించినా "ఆగు..' అన్న పిడుగులాంటి మాటతో చాకలి ఎంకన్న రెడ్డి అనే భయం ఏమాత్రం లేకుండా నరసింహారెడ్డిని ఎదిరిస్తాడు. అంతేకాదు, తన చాకలివాడనంతా చైతన్యపరచి, నీలవేణి విషయంలో రెడ్డికులం వారెవరూ చేయలేని సాయం, సాహసం చాకలిఎంకన్న చేస్తాడు. ఆమె మానాన్ని, భర్త ప్రాణాన్ని నిలబెడతాడు. అంతేకాదు, నీలవేణి పశ్చాత్తాపంతో ఎంకన్న కాళ్ళమీద పడినపుడు లేపి " నువ్వు మా తోబుట్టువు లాంటి

దానివమ్మా... ఈ కులాలు, మతాలు మనం పెట్టుకున్నయి... మనం ఒక తల్లి పిల్లలం తల్లీ.. ఈ లోకంలో ఉన్నయి రెండేరెండు తెగలు. ఉన్నోళ్ళు లేనోళ్ళు. ఉన్నోళ్ళ ఆగడాలు సిదక తొక్కాలంటె మనం కలిసుండాలి తల్లీ..” అని సమసమాజ తత్వాన్ని మనముందుకు తెస్తాడు ఎంకన్న.



అగ్రవర్ణాల వారంతా ఉన్నవాళ్ళు కాదు. అందులో ఉన్నవాళ్ళు కొందరే. లేనివాళ్ళు ఎందరో. అయినా, మనుషులమధ్య మంటలుపెట్టే కులాన్ని పట్టుకొని ఊగులాడేవాళ్ళు ఏనాటికైనా కిందపడి కాళ్ళుచేతులు విరుచుకునేవారేననే విషయం నీలవేణి జీవితాన్ని గమనిస్తే మనకు అర్థమవుతుంది. నీలవేణి కుటుంబ మాన, ప్రాణాలను నిలబెట్టిన చాకలి ఎంకన్న తెగువను, తమవారినందరినీ చైతన్యపరచిన తీరును చూస్తే ఈనాడు పల్లెల్లో అగ్రవర్ణాల అమానుషదాడులను, దౌర్జన్యాలను ఎదుర్కొనే చైతన్యాన్ని, స్ఫూర్తిని అన్ని వర్గాలవారు పొందాలని తెలుస్తుంది.

తమ రెడ్డికులం ఆడపిల్లను వివాహం చేసుకున్నాడన్న కసిని మనసులో పెట్టుకుని, కులవృత్తి చేయడం తెలియకపోయినా, రామవ్వ చిన్న కొడుకుచేత బట్టలు ఉతికించాలని పట్టుబట్టిన ఫ్యూడల్ వ్యవస్థపై తిరుగుబాటు చేసిన చాకలి స్త్రీ గాథ పెద్దింటి **అశోక్ కుమార్** రాసిన **“వెలి”**.(2002)

రామవ్వకు ముగ్గురు కొడుకులు. మొదటి ఇద్దరు కులవృత్తి చేస్తూంటే, చదువుకొని డాక్టరు దగ్గర పని నేర్చుకున్న చిన్న కొడుకు రెడ్ల అమ్మాయిని పెళ్ళి చేసుకుంటాడు. ఊర్లోనే డాక్టరు పని చేయాలనుకొంటాడు. కానీ, తమ వర్గం పిల్లను పెళ్ళి చేసుకున్నాడన్న కడుపుమంటతో ఎలాగైనా అతనితో బట్టలు ఉతికించాలని ఊరి పెత్తందార్లంతా పట్టుబడతారు. అందులో సత్తిరెడ్డి ఊరి సర్పంచ్‌తో ఉపాయం పన్ని, రామవ్వ మొదటి ఇద్దరు కొడుకులకు లోపాయకారి మాటలు చెప్పి ఆమెతో విభేదం సృష్టిస్తాడు. సత్తిరెడ్డి మాటలు విన్న రామవ్వ కొడుకులు చిన్న తమ్ముడు కూడా ఉతకాలనే ఉద్దేశంతో తాము ఉతికే ఇండ్లను మూడు భాగాలు చేస్తారు. అపుడు రామవ్వ తమ్ముడు తెలిసో తెలియకో పెద్దకులం పిల్లను లగ్గంజేసుకున్నాడని, కులం తక్కువోనికి పేదోనికి ఇంత మంచి పెండ్లామా? అనే ఓర్వలేనితనంతో పెద్దలు ఇలా చేస్తున్నారని ఎంత చెప్పినా వారు వినరు. ఇటువంటి స్థితిలో రామవ్వ చిన్నకొడుకు భాగానికి వచ్చిన కాపుల ఇళ్ళకు ఉతుకు కుంటు పడుతుంది. అప్పుడు సత్తిరెడ్డి, ఆయన వర్గమంతా చాకలి కులపెద్దల్ని పిలిపించి కోప్పడటంతో రామవ్వ ఇంట్లో సమావేశమవుతారు ఆ కులపెద్దలు. అక్కడు గుండె రగిలిన రామవ్వ “నా చిన్న కొడుక్కు బట్టలు ఉతకడం ఇష్టం లేదు. వాడు ఉతకడు. వాని బుద్దున్నపని వాడు చేసుకుంటడు. తాతలు తండ్రులనాటి నుంచి తరతరాలు బట్టలుతికే బతుకతమని కాయితం రాసిచ్చినమా ఏంది? వాళ్ళు ఎద్దు ఎవుసం ఇడిసిపెట్టి దుకాండ్లు పెట్టుకుంటలేరా! యాపారం జేత్తలేరా? నౌకర్లు జేత్తలేరా? నా కొడుకును జూసెవరకు ఓర్వ బుద్దయిత లేదు. వాళ్ళకేకాదు మీకు కూడా!” అని కులపెద్దల్ని దులిపేస్తుంది.

చివరికి తమ్ముడి వంతు బట్టలు ఉతకడానికి రామవ్వ పెద్ద కొడుకు ఎల్లయ్య ముందుకు వచ్చినా, సత్తిరెడ్డి, సర్పంచ్‌లు ఒప్పుకోరు. ఎలాగైనా రామవ్వ చిన్నకొడుకు, కోడలితోనే తమ బట్టలు ఉతికించుకోవాలని పట్టుబడతారు. చాకలివాళ్ళకు ఎవ్వరికీ ఉతకడానికి బట్టలు వేయొద్దని, అలావేస్తే వెయ్యిరూపాయలు జరిమానా కట్టాల్సివుంటుందని ప్రకటిస్తాడు సత్తిరెడ్డి. పక్కఊరిలోవున్న చాకళ్ళతో షరతుమీద బట్టలు ఉతికించుకోవడం మొదలు పెడతారు. దాంతో రామవ్వ, ఆమె చిన్నకొడుకులపై కులమంతా కక్ష కడుతుంది. ఇదంతా సత్తిరెడ్డి, సర్పంచ్‌ల నాటకమని తెలుసుకున్న రామవ్వ కులానికి వృత్తికి సంబంధం లేదని అనేక ఉదాహరణలు చెప్తుంది. కానీ, సత్తిరెడ్డి మాటలు విని కులపెద్దలు రామవ్వను, ఆమె చిన్నకొడుకును కులం నుండి వెల్లగొట్టడంతో విధిలేక ఉన్న భూములు అమ్ముకొని చిన్న కొడుకు, కోడలుతో బస్సెక్కుతుంది.

రెడ్లబలంతో ఊరిలో తమకు కూడా వాటా కావాలని పక్కఊరి చాకళ్ళు ఊరి చాకళ్ళతో గొడవ పడతారు. విషయం కేసయ్యి స్టేషన్ వరకు వెళుతుంది. ఊరిచాకళ్ళ దగ్గర పెద్ద మొత్తంలో లంచం తీసుకున్న పోలీసులు పక్కఊరి చాకళ్ళను ఊరిడిచి వెళ్ళిపోవాలని హెచ్చరిస్తారు. ఇలాంటి స్థితిలో మళ్లీ తన చిన్నకొడుకు, కోడలుతో ఊళ్ళో అడుగు పెడుతుంది రామవ్వ. రెడ్ల ఇండ్లమధ్యలో రెండేళ్ళ నుండి ఖాళీగా వున్న

ఇంట్లో తన చిన్నకొడుకుచేత ఊరంతటికీ ఉచితవైద్యం చేయించడానికి సిద్ధపడుతుంది రామవ్వ. ఎలాగైనా కులవృత్తిని చేయించాలనుకున్న పెత్తందారీ వ్యవస్థపై తిరగబడిన రామవ్వ చాకలి ఐలమ్మ వారసురాలు. రెడ్లంతా ఒక్కటై ఎన్ని కుళుళ్ళు, కుతంత్రాలు చేసినా, రాజకీయాలు చేసినా రామవ్వ దృఢసంకల్పాన్ని ఏమీ చేయలేకపోయారు. ఆమె చిన్న కొడుకుచేత కులవృత్తిని చేయించలేక పోయారు.



శ్రమకు తగ్గ ఫలితంకోసం చాకలివాళ్ళంతా ఏకమై బంద్ ప్రకటించి తమ డిమాండ్లను సాధించుకోవడమేగాక, ఒక బూర్జువా సర్పంచి నయవంచనతో కులానికి దూరమైన తమ కులస్తుడ్ని అక్కున చేర్చుకున్న ఐక్యతా కథ **పెద్దింటి అశోక్ కుమార్** మరో కథ **"సాకిరేవు".**(2000)

పెళ్ళయిన కొద్దిరోజులకే బాలయ్య తండ్రి నుండి వేరుపడతానంటాడు. తండ్రి ఎంత చెప్పినా, కులం ఏమి చెప్పినా వినడు. వేరుపడటం ఇష్టంలేని భార్య కూడా బాలయ్యకు నచ్చజెప్పచూచి విఫలమవుతుంది. ఎవరిమాటా వినకుండా వేరుపడ్డ బాలయ్య తన కుటుంబంతోపాటు, కులమంతటికీ దూరమవుతాడు. ఒకసారి లక్ష్మికి కడుపునొప్పి రావడంతో వైద్యం చేయించుకోడానికి డబ్బుల్లేక తాము బట్టలుతికే కిషన్ రెడ్డిని ఐదొందలు డబ్బులు అడుగుతాడు బాలయ్య. వారి అవసరాన్ని ఇంకో కోణంలో చూసిన కిషన్ రెడ్డి ఐదొందలు డబ్బులిస్తాడు. ఆ డబ్బులు ఆసుపత్రిలో ఖర్చవుతుంది. అదే సమయంలో ఆరు నెల్లకోసారి తమకిచ్చే ఎరం వడ్లు గిట్టుబాటు కావని, సబ్బు, సోడా, బ్లీచింగ్ పౌడర్ వంటి వస్తువుల ధరలు కూడా పెరిగాయని కులపెద్దలు బట్టలు ఉతక్కుండా బంద్ ప్రకటిస్తారు. బాలయ్య, రేవు పెడితే కులాన్ని ధిక్కరించినవాడవుతాడు. రేవు పెట్టకుంటే కిషన్ రెడ్డి దగ్గర తీసుకున్న ఐదొందలు డబ్బులు తిరిగి ఇవ్వాల్సి ఉంటుంది. ఏమీ తోచక చివరికి కిషన్ రెడ్డిని కలుస్తాడు. "ఆపదలో ఉన్నపుడు అప్పు ఇచ్చి ఆదుకోని కులంతో నీకేం పని, కులం నిన్నేం ఉద్ధరించింది?" అని కులం పట్ల బాలయ్యకు ఇంకా వ్యతిరేకతను కలిగిస్తాడు కిషన్ రెడ్డి. దాంతో కిషన్ రెడ్డి ఉండాడన్న ధైర్యంతో రేవు పెట్టడమేగాక, కిషన్ రెడ్డి ఇంట్లో శుభకార్యం కూడ పూర్తి చేస్తాడు బాలయ్య. కిషన్‌రెడ్డి మినహా ఊర్లోని కాపులందరి ఇళ్ళలో మురికి బట్టలు పేరుకుపోతాయి. మురికి అంటే ఏంటో, అదెంత అసహ్యంగా ఉంటుందో అర్థమయిన కాపులంతా ఎరం పెంచడానికి ఒప్పుకుంటారు. కానీ, బాలయ్యలాంటివారు ఇంకొకరు తయారవ్వకుండా ఉండటంకోసం చాకళ్ళు ఎవరూ మురికి బట్టలకోసం ఊళ్ళోకి వెళ్ళరు. విషయం పంచాయతీదాకా వెళుతుంది. పంచాయతీ పెద్ద కిషన్ రెడ్డి. పంచాయతీలో తన రాజకీయబుద్ధిని ప్రదర్శించి "వాడు నా వద్దకు ఆపద చెప్పుకొని అప్పు అడిగితే ఇచ్చాను. అప్పు తీర్చే దమ్ము లేక కులం మాట కాదన్నాడు. అందుకు శిక్షగా వాడిని వెలివేయండి. ఊరిలో భాగం ఇవ్వకండి" అని తీర్పు ఇస్తాడు కిషన్‌రెడ్డి. బాలయ్య నవనాడులు చల్లబడిపోతాయి. చేసిన తప్పును తెల్సుకొని పశ్చాత్తాపపడతాడు. పశ్చాత్తాపానికి మించిన శిక్షలేదని బాలయ్యను కులంలో కలుపుకుంటారు కులపెద్దలు. బాలయ్య మనసు కూడా మురికిని పిండిన రేవులా స్వచ్ఛమవుతుంది. బడుగు వర్గాల బలహీనతల్ని అగ్రవర్ణాలవారు తమకు ఏవిధంగా అనుకూలంగా మల్చుకుంటారో ఈ కథ ద్వారా తెలుస్తుంది. ఐకమత్యం ఉంటే బలహీనతల్ని కూడా బలాలుగా చేసుకొని తమ అస్తిత్వాన్ని ఎలా కాపాడుకోవాలో కులపెద్దల ఐకమత్యం ద్వారా తెలుస్తుంది.

పై కథలన్నిటినీ గమనిస్తే సమాజంలో చాకలివారి దీనస్థితి మనకు అర్థమవుతుంది. కులానికి, వృత్తికి ఉన్న సంబంధం సడిలిపోతున్నా, అగ్రవర్ణాల ఆధిపత్యానికి తలొగ్గి వృత్తిని చేయాల్సిన నిస్సహాయ పరిస్థితి మనకు కన్పిస్తుంది. కులవివక్షకు గురవుతూనే సమాజానికి పట్టిన మురికిని పిండి మల్లెలుగా తీరుస్తున్నారు. ఇప్పటికీ పల్లెల్లో కొందరు భౌతికదాడులకు బలి అవుతున్నారు. చాకలి స్త్రీలు తమ మాన, ప్రాణాలను పోగొట్టుకుంటున్నారు. అయితే, ఇప్పుడిప్పుడే వారిలో కూడా చైతన్యం కలిగి ఆత్మాభిమానాన్ని కోరుకుంటున్నారు. అందుకోసం ఎదురు తిరగడానికి కూడా సంకోచించడంలేదు. అలాంటివారిలో ధైర్యాన్ని పెంచేదిగా కథాసాహిత్యం తనవంతు కృషి చేస్తుంది. వృత్తిపనులు చేసేవారు పడే ఆవేదనను అర్థంచేసుకొని స్పందించడం కాకుండా, వారిలో నిగూఢంగా దాగివున్న తిరగబడే తత్వాన్ని వివరిస్తున్న కథలు సమాజంలో మార్పును తీసుకొని వస్తాయి.



# నింగి హద్దుగా

చెన్నా చక్రవర్తి
8886885174

ఊహ కదిలిన మేరా కుంచె నర్తిస్తుంది.
నా కేదీ అతీతం.....! నా పరిధి అనంతం.....!
సముద్రినిలా సమస్త పృధ్వీ మండలాన్ని
నులివెచ్చని కౌగిలిలో పొదుపుకొని
లాలిస్తున్నట్లు....., పాలిస్తున్నట్లు......,
రంగుల పొది నుంచి సప్తవర్ణ శోభిత సింగారం
బంగారం లాంటి ప్రతిమకు ప్రాణమద్దింది
జాతీయం అంతర్జాతీయమై
గూగుల్, యూట్యూబ్
స్వాగతించి, అక్కున చేర్చుకొని



జవ సత్వాలతో వేదిక నెక్కించాయి.
కుంచె కదిలింది జీవమై వేదమై......
నిత్యనూతనంగా శోభాయమానం చేసే నెబ్యులాలా
కదులుతూ విహరిస్తున్న అక్షరాలను పేర్చుతూ
మానవీయ కమనీయ ఆకృతులను కూర్చుతూ
కవిత్వీకరించే కవిహృదయానికి ప్రతిరూపమైంది కుంచె.
కుంచె కదిలింది జీవమై సమాజమై.

# అనుభవానికి అందని అనుభవం

జి. నరసింహమూర్తి
8977987266

ఎక్కడున్నావని వెదకను
ఎక్కడికెళ్లావని పిలువను
ఎక్కడుంటావని అనుకోను
ఎంతకాలమనీ ఎదురుచూడను
నీ అమృత హృదయాన్ని ఇక్కడేవదలి
గాయాల హృదయ వేణువును
నీ అక్కుళ్లలో అలరించేందుకు
నవ్వుతూ పట్టుకు పోయావు
ఆక్రోశించడం అవివేకమని
ఓ విదుషీమణిలా కళ్లతోనే
నచ్చజెప్పావు
నీ తలపుల తీగెల మీద ఊగుతూ
బతుకు పంజరంలో బంధించుకున్నాను
నీ రెక్కల మెత్తని చప్పుడు నిరీక్షణలో
వేచి వేచి వీచేగాలులే అలసిపోయాయి
ఆశలోంచి నిరాశ స్రవించి
మనస్సు నిగ్రహం కొల్పోతుంది
తనువు చివికి పోతున్న పంజరాన్ని
పట్టుకొని వేలాడ లేక పోతోంది



నిద్రాడు లేకుండా నిలబడ్డ
ఆకాశం కావాలనే కుప్పకూలి
పరిగ్రహించే అంతిమ మృత్యుపరిష్వంగ
దివ్యానుభవం కోసం నిరీక్షిస్తుంది.

# అసందర్భ సందర్భం

ఆవుల వెంకటేశులు

బతుకు గూళ్ళపై నిప్పుల్ని చెరుగుతూ
మానవత్వాన్ని మంట గలుపుతున్న
ఆ మాయావిని గురించి మాట్లాడుకుంటే
గుండె గండిపడిన చెరువులా పారుతుంది
ఎత్తుగడల వేదిక నెక్కి
మూగిన మందపై మత్తు మందు చల్లి
ఉపన్యాసాల ఉరి తాళ్ళను విసిరి
వాగ్దానాల శిలువకు వేలాడదీస్తాడు
ఆశల చూపులకు గాలం వేసి
వలకు చిక్కిన దేహాల్ని
ముళ్ళ కంచెపైకి విసిరి
దు:ఖం పూడుక పోయిన
గొంతుకతో నినదిస్తున్న
శిరస్సులను ఓటి కుండల్లా



విసిరేస్తాడు
జీతం నోట్ల కట్టల ఎరను వేసి
రొక్కం మీద మోహంతో ఊరకలెత్తిన
వలస మేధల్ని
తలతెగిన మొండాలుగా చేసి
కంప్యూటర్ కొట్టులో వేలాడదీస్తాడు
వెర్రెత్తిన వాంఛలతో
విశ్వాన్ని వశం చేసుకోవాలని
తలపుల తనువుల్ని దొప్పలుగా చీల్చి
శవాల తోరణాలతో
ప్రపంచ వీధుల్ని అలంకరిస్తాడు.
కనుసైగల్లోనే కుత్తుకలను కత్తిరించి
నిర్జీవమైన చూపుల చెలమల్లో
దాహం తీర్చుకుంటూ
కాలిన మానవత్వం మాంసపు
ముక్కల్ని నంజుక తింటున్న
మృగాన్ని గురించి మాట్లాడుకోవటం
ఒక అసందర్భ సందర్భమే!

# ఉమర్ అలీషా నాటకాలు - స్త్రీ పాత్ర చిత్రణ



- షేక్ రియాజుద్దీన్ అహమద్
9441983007

ఆంధ్రదేశంలోని ముస్లింల మాతృభాష ఉర్దూ. వారు ఆంధ్రదేశంలో నివసించిన కారణంగా ప్రాంతీయ భాష తెలుగు నేర్చుకొని, ప్రావీణ్యాన్ని సంపాదించి తెలుగు సాహిత్యంలో వెలసిన సకల ప్రక్రియలలో రచనలు చేసినట్లుగా ఆచార్య షేక్ మస్తాన్ 'తెలుగు సాహిత్యం, - ముస్లింల సేవ', సయ్యద్ నశీర్ అహమద్ 'అక్షర శిల్పులు' సాక్ష్యాధారం.

వక్తగా, రాజకీయ వేత్తగా, సాహితీ వేత్తగా, భారత శాసన మహాసభా సభ్యులుగా, మౌల్వీగా, బ్రహ్మర్షిగా సుప్రసిద్ధులు ఉమర్ అలీషా. వీరు తూర్పుగోదావరి జిల్లా పిఠాపురంలో 1885 సం॥లో జన్మించారు. తల్లి చాంద్‌బీబీ, తండ్రి మొహిద్దీన్ బాద్‌షా. బహుభాషా పండితుడైన వీరు సూఫీవేదాంత ధర్మము, స్వర్గమాత, ఖండకావ్యములు, తత్త్వ గ్రంధాలు, స్వర్గమాత, నాటకాలు, నవలలు, పారశీక గ్రంథాలు (ఉమర్ ఖయ్యాం) తెలుగులోనికి అనువాదం చేశారు.

1905 నుంచి 1932 మధ్యకాలంలో తెలుగులో మణిమాల, చంద్రగుప్త, దానవవధ, విచిత్ర బిల్హణీయము, మహాభారత కౌరవరంగము, విషాద సౌందర్యము, అనుసూయాదేవి, కళ మొదలైన నాటకాలను రచించారు.

సమాజంలోని దురాచారాలను రూపుమాపడానికి, ప్రజా బాహుళ్యంలో భక్తి ప్రపత్తులను పెంపొందించడానికి, దేశభక్తి, జాతీయతాభావాన్ని పాఠకులలో కలిగించడానికి, స్త్రీ ఔన్నత్యాన్ని చాటడానికి, సంఘ సంస్కరణకు పాటుపడ్డారని రచనల ద్వారా వ్యక్తమవుతుంది.

'విషాద సౌందర్యము' నాటకంలో యామినీ పూర్ణ తిలక కథానాయిక. ఆమె చెలికత్తె, చకోరిక. వీరిరువురి మాటల్లో సర్వప్రాణుల యందు దయకలిగి ఉండాలని, పర్యావరణ పరిరక్షణకు పాటు పడాలని తెలుస్తుంది.

“సఖీ! ఈ పువ్వులు గోసికొని దండలు గ్రుచ్చుకొందము రమ్ము” అంటుంది చకోరిక. అపుడు యామినీ “పూలు గోసెదవా! ఎట్లు” అని వెంట్రుకలు పట్టి లాగుతుంది. “తలనొప్పి యెత్తుచున్నది. విడువుము ! విడువుము !” అంటూ' “ఏమే నా తల వెంట్రుకలు పట్టి లాగుచుంటివి” అని ప్రశ్నిస్తుంది. “చెట్ల పువ్వులు నీ తల వెంట్రుకలు వంటివి కావా? వానికి మాత్రము నీవలె నేల బాధయుండక పోవును” అని ప్రశ్నిస్తుంది.

'మణిమాల' నాటకంలో సత్యరేఖ, మణిమాల,

మంజువాణి అనే పాత్రల ద్వారా సంఘ సంస్కరణాభిలాషను వ్యక్తం చేశారు.

"ఉవిదయై యుదయించినదనే సంబరముగాదు. పరస్పరానురాగ కళాకోవిదుడైన పురుషరత్నమా కన్యారత్నమునకు లభించనం గదా ధన్యయగును" అంటుంది సత్యరేఖ.

మరొక సన్నివేశంలో మణిమాల మంజువాణితో..

"కావ్యమును కన్యకను గాంచి ఖలులొకింత వంక దొరికిన వంచింత్రు జంకులేక" అని పలికిన పలుకులలో కన్యలు, కావ్యాలు ఆ నాటికే వంచనకు గురయ్యాయని, కన్యల్ని వంచించే దుష్టులున్నారని పేర్కొన్నారు. యుక్త వయస్సు వచ్చిన వారిపై పెద్దల ఆధిపత్యం వద్దని స్వయం నిర్ణయాధికారం ముద్దని వ్యక్తం చేశారు. కుల సతి ధర్మాన్ని గూర్చి సత్యరేఖ తన తండ్రి యక్షరాజుతో పలికిన సంభాషణ ద్వారా ధర్మాన్ని విస్మరిస్తే కీడు తప్పదని హెచ్చరిస్తారు.

"పెండ్లియాడినంతనే సంబరము గాదు. భర్త గారి పరిచర్యాచరణ విశేషమున ననుగ్రహపాత్రయై యుండుట కులసతికి ధర్మము. అటులాచరించిన జీవిత కాలములో లోపము రాకమానదు. లోపము వచ్చెనేని తప్పక కీడు మూడును. దానననేక దోషములకు హేతువై పడవొందును."

సత్యరేఖ చేటితో..

పరువు పోవుట కంటె మరణంబు శ్రేయంబు
మరణమన్న పెద్ద మాటగాదు
మానమున్న చాలు మాట మాణిక్యంబు
దక్కదెవరికైన నొక్కమారు

మానప్రాశస్త్యాన్ని తెలియజేశారు.

నుదుట రాసిన రాత తప్పక జరిగి తీరుతుందంటూ మంజువాణి పాత్ర ద్వారా క్రింది విధంగా తెలిపారు.

"చెలులారా! నుదుట లిఖితము
విలపించిన యేని బోదు విధిచైదము కా
నలదాగిన
వార్ధిని గ్రుం
కినను
వెన్నంటు శూల గిలికినైనన్

'దానవవధ' నాటకంలో పరమేశ్వరుని ప్రార్ధనా ప్రాముఖ్యంతో పాటు రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమ పాత్రల ద్వారా సమాజంలోని పోకడలను, చింతలను గూర్చి

కలిమికి జింత! లేమికి వగల్పడు చింత! నిశల్ పవళ్ళు నాం

కలిగిన జింత ! రోగములు గల్గినం జింత ! సుఖానుభూతిస్

వలవని చింత! పెమ్మిదిమి వచ్చినం జింత! హృదంత రాళముల్

కలచుచునుందీ మీరపుడు గాంచి తపింతురు స్వర్గలక్ష్మికై

భూలోకంలో మానవులు పడే బాధలను వ్యక్తం చేశారు

'రోగ పీడితులు గాని వాడు దినమంతయు లేవక పరుపుపై నిద్రించెనేని వానికా పరుపే పీడవలె దోచును. దీన్ని బట్టి పగటి నిద్ర పనికి చేటని, సోమరితనం వల్ల అనుకున్న పనులు నెరవేరవని తెలిపారు. దురదృష్టవంతులకు సిరియున్నను దరిద్రమే' అని మేనక అంటుంది. అపుడు తిలోత్తమ మేనకతో..

అత్తింటికాపురం కష్టమని అనితర సాధ్యములైన వాటిని కూడా అవలీలగా సాధించవచ్చునంటారు. వేశ్యలకై ప్రాకులాడే దుష్ట స్వభావం కలవారికి బ్రహ్మపుళ్ళు పెట్టి బాధించక తప్పదని హెచ్చరించారు. వేశ్యాలోలులకు హితసూచనగా భావించవచ్చు. పతియే ప్రత్యక్ష దైవమంటారు.

'విషాద సౌందర్యము' నాటకంలో భద్ర, భ్రమర, సాగరిక, రాధ, చారుమతి పాత్రల ద్వారా భార్యలకు భర్తపైన ఉండే మమకారాన్ని, ప్రేమను, హితాన్ని, పరస్త్రీలను కోరే వారికి కలిగే చెడుగతులను, దురాచారాలను ఎత్తిచూపారు.

"అతివ రత్నాంబరములకాసపడదు /....../....../
.../...పతులకాయాసులేదు"

"నగలు గావలెనంచు జగడమాడంగలేదు.....
...../ జలమడిగినట్లు

"దార విడనాడి యన్యుని దార కొఱకు
పరితపించు మూర్ఖుడెప్పటికైన
దుర్గతుల పాలుగా కను నిర్గమింపం
డల సురారి బలారియేరైనగాని"

"అలినేనుండ మనసు గయ్యాళి చేసి
వయసుదలపక పరునాలిపై దగిల్చె
నెంత చెడిన లోకుల నిందలెంచవలదె
వావి వరుసలు కామికి లేవు నిజము.

'కళ' స్త్రీ ప్రాశస్త్యాన్ని చాటిచెప్పే నాటకం. కళ, చంచల, దేవకన్యలు, ఎరుకసాని ఇందులో స్త్రీ పాత్రలు. కష్టకాలంలో

# న్యాయం కావాలి

- దారల విజయకుమారి
9849159147

భూసేకరణంటూ
అధికారం... అదిలింపుల్తో
మనుగడే సమస్యగా మారి
ప్రతి నిమిషం.. అభద్రమై
దీనమై... భారమై...
ఎంకిపెళ్ళి సుబ్బిచావు చందంలా
అభివృద్ధంటే..
బడుగుల ఆధారం పోవటమా?
అంతులేని ప్రశ్నలకు బదులివ్వాలి
బదులివ్వాలి....
కంకులేవని అడిగే పిట్టలకు
చివుళ్ళు మేసిన కోయిలకు
పచ్చదనానికి... పల్లెసీమకు
గడపగడపకు... గుండె గుండెకు
గాలికి... నీరుకు
నింగికి... భూమికి
గట్లుకు... కాల్వకు
అల్పజీవుల అవాసాలకు
అన్నదాతల నివాసాలకు
బదులివ్వాలి...



దూరమౌతున్న నిశ్శబ్దానికి
చేజారుతున్న స్వచ్ఛతకు...
సహజత్వానికి
పుట్టే రేపటి బిడ్డకు
చెమట చుక్కలు...
నెత్తుటి బొట్లు.. నిట్టూర్పులతో
నిండిన నేలకు
కొలత కందని రెక్కల కష్టానికి
బదులివ్వాలి...
రచ్చలుంటే... రావిచెట్టు..
చెలమ... చెరువుగట్టు
లెక్కలేనన్ని ఛాయల్లోని
పల్లె జీవన దృశ్యాలకు
భూమిలో అనుబంధానికి
ఎడబాటు ఆవేదనకు
రేపటి అగమ్యానికి
భరోసా కావాలి
బతుకు భద్రమూ...
భయ రహితము అయ్యేలా.....
భరోసా కావాలి



సైతం భర్తకు చేదోడు వాదోడుగా ఉంటూ ధర్మం తప్పకుండా ఆచరించడం ఈ నాటకం ద్వారా తెలుస్తుంది. చంచల పాత్ర ద్వారా వడ్డీ వ్యాపారాన్ని నిరసిస్తారు.

"ఇంటనెంత ధనము నీల్గుచుండిన
గడ్డి తింద్రు కాసు వడ్డికొఱకు
కాటి యొద్ద నక్క కైవడి పేదల
శల్యములను గొఱికి చంపు చంద్రు"
పతివ్రతలను తాకితే మాడిమసై పోతారని

"అగ్నిమ్రింగవచ్చు...... కళక బోలె పద్యం ద్వారా రచయిత హెచ్చరిస్తారు.

దుర్మార్గులకు పూచీ పడితే నట్టేట ముంచుతారంటారు. రాజభటులు చంచలతో ఇలా అంటారు "స్త్రీలను దొంగలించి బానిస వర్తకం చేస్తున్నాడన్న నేరం మోపి ప్రభుత్వం బంధింపదలచిందని ఎవరైనా పూచీపడితే విడిచి వేస్తామంటారు" ఆ మాటలు విన్న చంచల

"బాబూ! ఈ దుర్మార్గునకెవరును నీ ప్రపంచములో బూచీ పడరు. పడినను వారల నట్టేట ముంచి వేయసమకట్టును. కావున వెంటనే వీనిని చెరసాలలో బంధించి బుద్ధి చెప్పుడు మీకు పదివేల నమస్కారము'' అని పలుకుతుంది.

ఉమర్ అలీషా రచించిన నాటకాలలో పురుష పాత్రల ద్వారా దేశభక్తిని, జాతీయతా భావాన్ని, సంఘ సంస్కరణను, సామాజిక పోకడలను ఎత్తి చూపారు. వీరు 23 జనవరి 1945న పరమపదించారు.



# భగ్వాన్ - పర్యావరణ కవిత్వం

నీలం వెంకటేశ్వర్లు
9502411149



ఈ పర్యావరణ కవిత్వం పశ్చిమ గోదావరి జిల్లాకు చెందిన ఎ.పి.యస్. భగ్వాన్ కవిత్వంలో కూడా కనిపిస్తుంది. భగ్వాన్ శబ్దాల్ని ప్రేమిస్తూ(1992), వడ్లబండి(1997), బల్లకట్టు(2002) అనే వచన కవితాసంపుటాలను, ఏటి ఒడ్డున ప్రయాణం(2000) అనే హైకూ సంపుటిని వెలువరించారు. ఈయన వృత్తిరీత్యా ఉపాధ్యాయుడు కావటం చేత ప్రకృతిపై మరింత మమకారాన్ని పెంచుకున్నాడు. భగ్వాన్ ఎంతటి ప్రకృతి ప్రియుడో ఆయన కవిత్వంలోని ప్రకృతి సౌందర్యమే పట్టిస్తుంది.

ఈనాడు ప్రతి సంవత్సరం ఉంటున్న ఉష్ణోగ్రతల కన్నా అత్యధిక ఉష్ణోగ్రతలు నమోదు అవుతున్నాయి. సకాలంలో కురవాల్సిన వర్షాలు కురవటంలేదు. కొత్త కొత్త వ్యాధులు పుట్టుకొస్తున్నాయి. ఏ ఋతువు కూడా తన పని తాను సక్రమంగా నిర్వహించలేకపోతుంది. ఈ అస్తవ్యస్తతకు కారణం మనం ప్రశ్నించు కుంటే ఖచ్చితంగా మనిషే కారణమని ఒప్పుకోక తప్పదు. మనిషి హాయిగా, విలాసవంతంగా బతకటానికి ప్రకృతి, పర్యావరణాల విధ్వంసానికి పాల్పడుతున్నాడు.

ప్రకృతి, పర్యావరణం పదాలకు ప్రముఖులు కొన్ని నిర్వచనాలు ఇచ్చారు. '' దృశ్యమానమైన స్థావరజంగమాత్మకమైన జగత్తంతయు ప్రకృతియని " డా. సి. నారాయణరెడ్డి గారు (ఆధునికాంధ్ర కవిత్వము: సంప్రదాయములు, ప్రయోగములు) భావించారు. అలాగే డా. ఎన్.నిర్మలాదేవి ' తెలుగు సాహిత్య చరిత్ర–భావ కవితాయగం ' అనే వ్యాసంలో(తెలుగులో కవిత్వోద్యమాలు) ప్రకృతిని ఇలా నిర్వచించారు. " ప్రకృతి కన్న తల్లిలా ఒడిలోకి తీసుకుని లాలించేది, గురువులా ఉద్బోధించేది, దేవతలా దీవెనలిచ్చేది, స్నేహితుడిలా హితాన్ని తెలిపేది, శ్వాసించేదిగా కనబడుతూ ఆత్మానందతృప్తులకు, సత్యాన్వేషణకీ ఆధారభూతమైంది." అంటూ ఇద్దరు కూడా ప్రకృతికి ఆధ్యాత్మిక చింతనతో కూడిన నిర్వచనాలు ఇవ్వడం గమనించవచ్చు. పై నిర్వచనాలను బట్టి చూస్తే " మానవున్ని పరిపూర్ణమైన వ్యక్తిగా తయారుచేసేదే ప్రకృతి " అని మనం భావించవచ్చు.

" జీవులు, పరిసరాలకు మధ్య ఒక నిర్దిష్ట సమన్వయ సహకారం ఉంటుంది. ఈ జీవ, నిర్జీవ అంశాల సమన్వయ సహకార సంక్లిష్టతనే పర్యావరణంగా " టాలమీ పేర్కొన్నాడు. ప్రకృతి విశాలమైనదైతే, పర్యావరణం కొంత సరిహద్దులను కల్గి ఉంటుంది. ఈ మధ్య కాలంలో 'పర్యావరణం' అనే పదం విస్తారమైన వినియోగాన్ని పొందింది. దీనికి కారణం మనకు ప్రాణాధారమైన పర్యావరణాన్ని మనమే సంక్షోభంలోకి నెట్టివేయటం.

సంక్షోభంలో కూరుకుపోతున్న పర్యావరణాన్ని సంరక్షించి, పునరుద్ధరించాలనే లక్ష్యంతో 1940లలోనే యూరప్‌లో పర్యావరణ వాదం ప్రారంభమైంది. అలాగే జూన్–5 ను ' ప్రపంచ పర్యావరణ దినోత్సవం'గా యావత్ ప్రపంచం పాటించాలని 1972లో యూఎన్‌వో ప్రతిపాదించింది. ఈ క్రమంలోనే పర్యావరణాన్ని

రక్షించుకోవాల్సిన అవసరాన్ని ప్రపంచ దేశాలు గుర్తించాయి. మరోవైపు తరతరాల నుంచి ప్రకృతితో మనకు గల సంబంధాన్ని దూరం చేసుకుంటూ ఉండటం వల్ల మనిషి మనుగడ అత్యంత సంక్లిష్టంగా మారుతుందన్న సత్యాన్ని కవులు కూడా గ్రహించారు. ఈ సంక్లిష్టత నుంచి సమాజాన్ని రక్షించే బాధ్యతను వెంటనే కవులు తమ చేతుల్లోకి తీసుకున్నారు.

'మనిషి వస్తువ్యామోహ ఖైదీగా ఉండకుండా ప్రకృతి ప్రేమకు తామొక వ్యక్తిగా జీవించే చైతన్యాన్ని కవులు, రచయితలు కలిగించాలని' అంటారు కొండ్రెడ్డి వెంకటేశ్వరరెడ్డి. సహజంగా కవులు ప్రకృతి ప్రేమికులే. నిరంతరం సామాజిక సమస్యలపైన, వివిధ రకాల విధ్వంసక దుశ్చర్యలపైన కలమెత్తే కవులు పర్యావరణ విధ్వంసక చేష్టలపైన కూడా స్పందించాల్సిన అవసరాన్ని గుర్తించారు. ఈ క్రమంలో పుట్టుకొచ్చిందే పర్యావరణ కవిత్వం.

పర్యావరణ విధ్వంసక చేష్టలపైన కూడా స్పందించాల్సిన అవసరాన్ని గుర్తించారు. ఈ క్రమంలో పుట్టుకొచ్చిందే పర్యావరణ కవిత్వం.

ప్రకృతి సౌందర్యాన్ని కాక ' ప్రకృతి, పర్యావరణ పరిరక్షణ' ను వస్తువుగా తీసుకొని రాసే కవిత్వాన్ని పర్యావరణ కవిత్వం(ఇకో పోయేట్రి) అంటారు. సాహిత్యం ద్వారా ప్రజల్లో పర్యావరణ చైతన్యం కల్గించడమే పర్యావరణ కవిత్వం యొక్క ప్రధాన లక్ష్యం.

చేకూరి రామారావు 'ఇరవయొకటో శతాబ్దంలో కవిత్వం' అనే వ్యాసంలో(లోగిలి మాసపత్రిక, సెప్టెంబర్ 2014) పర్యావరణ కవిత్వం యొక్క వ్యాప్తి గురించి ఇలా ప్రస్తావించారు " ఇటీవలి కాలంలో అరుదుగానైనా పర్యావరణ స్పృహ కనిపిస్తున్నది. పతంజలి శాస్త్రి కవిత్వంలో ఇది స్పష్టంగా ఉంది. సినారే, గోపీల కవిత్వాలలో ఇది కనిపిస్తుంది కాని ఇది మరి మార్నింగ్ వాక్‌ల అనుభవాలకే పరిమితం. ఆదూరి సత్యవతీదేవి కవిత్వంలో కూడా ఈ స్పృహ ఉంది. బహుశా ఈ శతాబ్దంలో ఈ ధోరణి విస్తరించి 2001 నాటికి ఒక ముఖ్య ధోరణిగా నిలదొక్కుకోవచ్చు. పైగా ప్రతి నగరజీవికీ కాలుష్య సమస్య ప్రత్యక్షంగా ఎదురవుతున్నది. ఈ విషయమై కథలూ, నవలలూ వస్తున్నాయి కవిత్వమే కాస్త వెనకబడి ఉంది." అంటారు. 2001 తర్వాత ఈ పర్యావరణ స్పృహ కవిత్వంలో కొంత వేగం పుంజుకుందనే చెప్పవచ్చు. ఎస్.ఆర్. భల్లం, పాపినేని శివశంకర్ లాంటి అనేక మంది కవుల కవిత్వంలో పర్యావరణం చోటు సంపాదించుకుంది. ఈ పర్యావరణ కవిత్వం పశ్చిమ గోదావరి జిల్లాకు చెందిన ఎ.పి.యస్. భగ్వాన్ కవిత్వంలో కూడా కనిపిస్తుంది. భగ్వాన్ శబ్దాల్ని ప్రేమిస్తూ(1992), వడ్లబండి(1997), బల్లకట్టు(2002) అనే వచన కవితాసంపుటాలను, ఏటి ఒడ్డున ప్రయాణం(2000) అనే హైకూ సంపుటిని వెలువరించారు. ఈయన వృత్తిరీత్యా ఉపాధ్యాయుడు కావటం చేత ప్రకృతిపై మరింత మమకారాన్ని పెంచుకున్నాడు. భగ్వాన్ ఎంతటి ప్రకృతి ప్రియుడో ఆయన కవిత్వంలోని ప్రకృతి సౌందర్యమే పట్టిస్తుంది. అందుకే మానవుడు చేస్తున్న ప్రకృతి విధ్వంసాన్ని చూసి చలించిపోయాడు. ఆ చలనమే ప్రజల్లో పర్యావరణ చైతన్యాన్ని కల్గించాలనే భావనను ఏర్పరచింది. భగ్వాన్ పర్యావరణ కవిత్వంలో శిథిలమవుతున్న ప్రకృతి సౌందర్యం, కలుషితమవుతున్న వాతావరణం, మృగ్యమవుతున్న అడవి మృగాలు, పక్షులు, కాలుష్య కారకాలు, ప్లాస్టిక్ చేస్తున్న విధ్వంసం, మానవ మనుగడకు ఏర్పడుతున్న ఆపద వంటి అంశాలు చోటుచేసుకున్నాయి.

మానవుడు తన స్వార్థం కోసం మానవ మనుగడకు ఆధారమైన చెట్లను నరికేసి కాంక్రీటరణ్యాలను నిర్మించుకుంటున్నాడు. అందుకే భగ్వాన్ ' పిట్టా చెప్పవే ' కవితలో చెట్ల యొక్క ఆవశ్యకతను ఇలా తెలియపరిచాడు.

**" ఏ ఎయిర్‌కూలరూ మనల్ని కాపాడదు**
**మన సౌఖ్యాలకు / ఏ కంప్యూటరూ భరోసా ఇవ్వదు / శుక్రుడ్ని తాకిన విజ్ఞానం తన సూత్రాలను / నేలమీద చెట్టుకింద నెమరేసుకోవాల్సిందే...**

**..... ..... .....**

**చెట్ల ఆకులే మన ఎర్ర రక్తకణాలు / తను ఇంత విషం మింగి / మనకింత అమృతాన్ని పంచే చెట్టుని / పరమశివుని అవతారమంటే తప్పంటారా..." ( బల్లకట్టు, పుట-5)**

అంటాడు కవి. చక్కని మిథోపోయిని ఉపయోగించి చెట్టుకు పరమశివుని అవతారంతో పోలిక చెప్పటం వల్ల సాధారణ పాఠకునికి సైతం అర్థం అయ్యేలా కవి తన భావాన్ని వ్యక్తపరిచాడు. ఒకప్పుడు ఇంటిచుట్టూ పది చెట్లతో పచ్చదనం కనువిందు చేసేది. కాని ఈనాడు అభివృద్ధి చెందుతున్న దేశాలు పారిశ్రామిక ప్రగతి ముసుగులో పచ్చని గ్రామాలను

సైతం వెచ్చని పారిశ్రామిక వాడలుగా మారుస్తున్నారు. ధ్వని , ధూళి కాలుష్యాల్ని వడబోసే శక్తి ఒక్క చెట్లకు మాత్రమే ఉందన్న సత్యాన్ని మనం మర్చిపోతున్నామని కవి గుర్తుచేస్తున్నారు. నేటి ప్రభుత్వాలు ' నీరు-చెట్టు ' వంటి కార్యక్రమాలు ప్రవేశపెట్టినా అవి క్షేత్రస్థాయిలో ఎంత మాత్రం సత్ఫలితాలను ఇస్తున్నాయన్నది సందేహమే. వృక్షో రక్షతి! రక్షిత:! అన్న మాటలోని సత్యాన్ని గ్రహించిన వారు కాబట్టే భగ్వాన్ ' ప్రియమైన అయ్యల్లారా అమ్మల్లారా, మీమీ పిల్లల్ని పెంచుకుంటున్నట్లే, చెట్లనూ పెంచండి' అంటూ కవి మనల్ని అర్థిస్తున్నారు. అలాగే చెట్ల వల్ల ఉపయోగాలను, వాటిపై జరుగుతున్న దాడులను భగ్వాన్ రచించిన ఇంటి ముందువేపచెట్టు, నేలమట్టం వంటి కవితలలో దర్శించవచ్చు.

**ప్రియమైన అయ్యల్లారా అమ్మల్లారా, మీమీ పిల్లల్ని పెంచుకుంటున్నట్లే, చెట్లనూ పెంచండి' అంటూ కవి మనల్ని అర్థిస్తున్నారు.**

మానవజాతి అస్తిత్వానికి ప్రకృతి పరిరక్షణ చాలా ముఖ్యం. కానీ మన అవసరాలు తీర్చుకునే క్రమంలో గాలి, నీరు, నేలను కాలుష్యంతో విషపూరితం చేస్తున్నాం. కోస్తా జిల్లాల్లో రొయ్యల ఫ్యాక్టరీలు రచిస్తున్న కాలుష్యకాండను భగ్వాన్ ' రొయ్యతల ' ఖండిక ద్వారా మన ముందుంచాడు.

**" రొయ్యల పంటకన్నా / మనిషి కలల పంట విలువైందని / రొయ్యల వ్యాపారికి ఎవరు చెబుతారు / డబ్బు పిచ్చి పట్టుకున్నవాడికి ఏదీ కనబడదు / వ్యాపారం మోజులో ఏదీ వినబడదు / డాలరు నోటు మీద రొయ్యబొమ్మ గీసుకుంటూ / ఏసీ రూములో ఏ వాసన తగలకుండా / కులుకేవాడ్ని / రొయ్యతలల లారీలో తలుపులేసి కూర్చోబెట్టాలి / రొయ్యతలల కంపు ఎంత నరకమో / వాడికి మళ్ళీ మళ్ళీ రుచి చూపించాలి"**

**- ( బల్లకట్టు , పుట- 46 )**

కాసుల పంట కోసం పచ్చని పంట భూములను రొయ్యలు, చేపల చెరువులుగా మార్చి పర్యావరణానికి పెద్ద విఘాతం కల్గిస్తున్నారని కవి ఆక్రోశిస్తున్నాడు. ఈనాడు గ్లోబలైజేషన్ పుణ్యమా అని హద్దులు లేని ఆర్థికాభివృద్ధి సాధనే మనిషికి లక్ష్యం అయింది. అంతర్జాతీయ మార్కెట్ విపణిలో రొయ్యలకు మంచి గిరాకీ ఉండటం, రొయ్యల పరిశ్రమ యాజమాన్యానికి డాలర్లు పండిస్తుండటం వల్ల వారు నిబంధనలకు నీళ్ళొదిలినా అటు అధికారులు గాని, ఇటు పాలకులు గాని వారిపై చర్యలు తీసుకునే పరిస్థితులు కనబడటం లేదు. ఒకప్పుడు" ప్రజల యొక్క ప్రజల చేత, ప్రజల కోసం పాటుపడేదే ప్రజాస్వామ్యం" అన్న నిర్వచనం కాస్తా నేడు " పరిశ్రమల యొక్క పరిశ్రమల చేత, పరిశ్రమల కోసం పాటు పడేదే ప్రజాస్వామ్యం'' గా రూపాంతరం చెందటం మన దురదృష్టం. అందుకే భగ్వాన్ మన పర్యావరణానికి పట్టిన కాలుష్య జబ్బును నయం చేసి, ప్రకృతి ప్రాణం కాపాడే డాక్టర్లం మనమే కావాలని సమాజానికి పిలుపునిచ్చాడు.

ప్రకృతిలోని చైతన్యానికి, వ్యక్తి వాస్తవిక జీవితానికి మధ్య హైకు వారధి కడుతుంది. హైకూ, ప్రకృతులది విడదీయలేని బంధం. పర్యావరణ విధ్వంసాన్ని ఆవిష్కరించిన ఈ హైకూను పరిశీలిద్దాం.

**" ఎన్ని రంగుల్ని మింగిందో**
**ఇంత తెల్లగా ఉంది**
**పొగమంచు "**

**(ఏటి ఒడ్డున ప్రయాణం, పుట-12 )** భగ్వాన్ ఈ హైకు బాహ్యస్వరూపంలో ఒక చక్కని ప్రకృతి సౌందర్య దృశ్యాన్ని చూపించారు. కాని దాని అంతస్వరూపాన్ని చూస్తే, పొగమంచు ఎక్కువగా కర్మాగారాలు ఉండే నగరాలలో దట్టంగా ఉండటం మనం గమనించవచ్చు. కర్మాగారాలు విడుదల చేసే వ్యర్థజలాలు, ధూళి అణువులు, పొగ వీటన్నింటి కలయిక వల్ల ఈనాడు కృత్రిమంగా పొగమంచు ఏర్పడుతుంది. ఇది వాయుకాలుష్యానికి కారణమవుతుంది. ఈ హైకూలో భగ్వాన్ ' మింగింది ' అనే పదం ద్వారా ఈ కృత్రిమ పొగమంచు యొక్క రాక్షసత్వాన్ని సూచించాడు.

మన జీవన శైలిలో ప్రకృతిపైకి కత్తి దూస్తున్న మరొక అలవాటు ప్లాస్టిక్ వినియోగం. ఈ ప్లాస్టిక్ వస్తువాడకం ఎంత ప్రమాదకరమో కవి ' విధ్వంస కర్బనం ' అనే కవితలో ఆవిష్కరించాడు.

**" ప్లాస్టిక్ వస్తు సోయగాల మీద / తనువూ మనసూ ఆరేసుకునేవాడికి / ఎలా వివరించగలం... / అది క్రమానుగత గరళమని ! / 'అఫ్టాల్ ప్లాస్టిక్' / అనుకుంటే పొరపాటు / అంత అఫ్టాల్‌గానూ / అది భూగోళాన్ని చప్పరిస్తుంది "**

**( బల్లకట్టు, పుట-48 )** ఇటీవల మన నిత్యజీవిత వ్యవహారంలో ప్లాస్టిక్ వాడని మనిషి లేడు, ముట్టని చేయి లేదు. చేతి సంచి మొదలు వంట పాత్రల దాకా ప్లాస్టిక్ మన ఇళ్ళలో రాజ్యమేలుతుంది. ఈ రోజు ఏ శుభకార్యం జరిగినా

అక్కడ ప్లాస్టిక్ పూలు, ప్లాస్టిక్ పండ్లు, ప్లాస్టిక్ తోరణాలే స్వాగతం పలుకుతున్నాయి. ప్లాస్టిక్ వాడకం పెరిగిందంటే మన ఆయుస్సు తగ్గుతుందని గుర్తించుకోవాలి. 'అది భూగోళాన్ని చప్పరిస్తుంది' అని అనటంతో, ప్లాస్టిక్‌ను ఒక భయంకరమైన రూపంలో మన కళ్ళ ముందు నిలపటంలో కవి ప్రతిభ కనిపిస్తుంది. మన రాష్ట్రంలో ప్లాస్టిక్ నిషేధం ఉన్నప్పటికీ, అధికారులు తమ అలసత్వం మూలంగానో లేదా ఉత్పత్తి దారుల ప్రలోభాల కారణంగానో ఆ చట్టాలకు తూట్లు పొడుస్తున్నారు. ఇలాంటి విషయాలలో చట్టాల కన్నా మనలో చైతన్యం ముఖ్యం. ఏది ఏమైనా ప్లాస్టిక్‌ను నిషేధించే బాధ్యత దానికి చావులేని వరాన్ని ప్రసాదించిన మనిషిపైనే ఉందని కవి మన బాధ్యతను గుర్తుచేస్తున్నాడు.

**సాంకేతికాభివృద్ధి కారణంగా సీతాకోకచిలుకల జాతులు అంతరించిపోవడాన్ని భగ్వాన్ 'సీతాకోకలు మరణిస్తున్నాయి' అనే కవితలో హృదయవిదారకంగా చిత్రించాడు.**

ప్రకృతికి, మానవునికి.... మానవునికి, పక్షులకు మధ్య అనాదిగా విడదీయరాని అనుబంధం కొనసాగుతూ వస్తుంది. కాని మారుతున్న పరిణామాల నేపథ్యంలో ఈ అనుబంధం తెగిపోతుంది. సాంకేతికాభివృద్ధి కారణంగా సీతాకోకచిలుకల జాతులు అంతరించిపోవడాన్ని భగ్వాన్ 'సీతాకోకలు మరణిస్తున్నాయి' అనే కవితలో హృదయవిదారకంగా చిత్రించాడు.

**"ఎంత విధ్వంసకర దృశ్యం / అన్ని జాతుల సీతాకోకలూ ఒక్కపెట్టున అంతరించిపోవడం / మనిషో / ధన సంపాదన మీద మనిషికున్న యావో / మనిషి సృష్టించిన ఏ విష కాలుష్యమో / ఏదైతేనేం సీతాకోకల నాజూకు ప్రాణాలు తీసేందుకు"** – **( బల్లకట్టు, పుట-77 )**

ఆధునిక కాలంలో సాంకేతిక పరిజ్ఞానం వల్లనే అనేక పక్షిజాతులు అంతరించి పోతున్నాయని కవి పడే ఆందోళన మనకు ఈ కవితలో కనిపిస్తుంది. పిచ్చుకలు, సీతాకోకచిలుకలు వంటి చిన్న చిన్న పక్షిజాతులు అంతరించిపోవడంలో సెల్‌టవర్ల నుంచి వచ్చే రేడియేషన్‌లు ప్రధాన పాత్ర పోషిస్తున్నాయి. ఈ సెల్‌టవర్లు గ్రామీణ ప్రాంతాలకు సైతం విస్తరిస్తుండటం ప్రకృతి ప్రేమికులకు ఆందోళన కల్గిస్తుంది.

వాతావరణ కాలుష్యం, ఓజోన్ పొర చిల్లులుపడటం, పశుపక్ష్యాదులు అంతరించిపోవడం వంటి ఈ విధ్వంసాలు ఇలాగే కొనసాగితే మనిషి మనుగడ ఏమవుతుందో భగ్వాన్ 'మౌసమ్ కీ జాన్‌కారీ' కవితలో తెలియపరిచాడు.

**"యవ్వనంలో ముసలితన మొస్తుంది / మనిషి సృష్టించుకున్న భోగ వస్తువులు / మనిషి మీదే దాడి చేస్తాయి రహస్యంగా / ఆత్మరక్షణ కరువవుతుంది / వ్రణాలుగా అంటురోగాలుగా అంగవైకల్యాలుగా / అతినీల లోహిత కిరణాలు దేహాల్ని చీలుస్తాయి / ఉపద్రవాలు నేల నేలుతాయి / ఉత్పాతాలు కోరస్ పాడుతూ ఊరేగుతాయి"** – **( వడ్లబండి, పుట-32 )**

మన విలాసాల కోసం, వినోదాల కోసం ఇలాగే పర్యావరణాన్ని ధ్వంసం చేసుకుంటూ పోతే భూమి మీద ఊహించని ఉపద్రవాలు, ఉత్పాతాలు చెలరేగిపోతాయి. ఇవి మనిషి మీద దాడి చేయడం ఖాయమనీ, కొంత కాలానికి మానవజాతి మనుగడ కూడా ప్రశ్నార్థకంగా మారుతుందనీ కవి తన ఆందోళనను వ్యక్తపరుస్తున్నాడు. దీనికి పర్యావరణ పరిరక్షణ ఒక్కటే నివారణా మార్గమని ఐక్యరాజ్యసమితి కూడా నినదిస్తోంది.

ఇప్పటికే వాతావరణంలో వివిధ వాయువుల పరిమాణం అధికమవడం వల్ల 'గ్లోబల్ వార్మింగ్' పెరుగుతుంది. భూగోళంపై ఉష్ణోగ్రత పెరగడం వల్ల గాలి, నీరు, నేల సమతౌల్యం కోల్పోతున్నాయి. అందుకే 2015 డిసెంబర్‌లో పారిస్‌లో జరిగిన క్లైమేట్ చేంజ్ సదస్సులో గ్రీన్‌హౌస్ ప్రభావం వలన రోజురోజుకూ పెరిగిపోతున్న భూతాపాన్ని 2100 నాటికి ఎట్టి పరిస్థితుల్లోనూ 2 డిగ్రీల సెంటీగ్రేడ్ కంటే మించకుండా చూడాలని 195 దేశాలు అంగీకారం కుదుర్చుకున్నాయి. ఈవిధంగా మన పర్యావరణాన్ని పరిరక్షించుకునే బాధ్యత ప్రభుత్వాలపైనే కాకుండా మనందరిపైనా ఉందనే సత్యాన్ని మరవరాదని భగ్వాన్ తన కవిత్వం ద్వారా సమాజాన్ని చైతన్యపరిచాడు. సమాజంలో బాధ్యత గల ప్రతి పౌరుడు ఆ చైతన్యాన్ని అందుకొని పర్యావరణ పరిరక్షణకు తనవంతు సహకారం అందివ్వాలి. అప్పుడే ప్రకృతికి, మనిషికి గల అనుబంధం కూడా బలపడుతుంది.



## సాలీడుగూడు

డా॥ తన్నీరు నాయబ్ రసూల్
9490170661



దోపిడీని అలంకరించుకొన్న పరాయితనానికి
అధికారం అండగా నడుస్తూనే ఉంటుంది
స్వేచ్ఛాయుధ గురుతులను ఇనుపగద్దలు
ఆకలితో కమ్ముకొంటున్న భయానక దృశ్యం
జాతిదేహంపై పొడుచుకొస్తున్నది
ఒడలు పరుచుకొన్న ప్రపంచీకరణలో
ప్రైవేటీకరణ ఒక పాయగా, మాయగా
ప్రజాస్వామ్యాన్ని పాదాక్రాంతం చేసుకొంటున్నది
పాలకులు ఎర్ర తివాచీలతో స్వాగతిస్తున్నారు
ఎప్పుడో రూపుమాసిన బానిసత్వాన్ని
బహుమతిగా నాయకులు నీకిప్పుడిస్తారు
ఇంకా నువ్వు తీపి స్వప్నంలో తపిస్తున్నప్పుడు
నీ ఆధారం నిరాధారమవుతుంది
చేతగాని తనం ఆకాశపు కాన్వాసుపై
విషణ్ణలిపితో చిత్రించుకొని వేలాడుతుంటుంది
పేదరిక వలయంలో బంధీగా మగ్గుతుంటావు
ప్రైవేటీకరణ హస్తం కింద గాఢంగా
వర్తమానం జీవితం కునారిల్లబోతోంది
ఇప్పుడే గట్టిగా గాలిని పీల్చి ఎదలో
దాచేయ్
చిరునవ్వును పెదవుల వెనుక
భద్రపరుచు
ఆలోచనలను ఆశలకొయ్యకు
తగిలించు
నీ నేలపై పరాయివాడవు
కాబోతున్నావ్
ప్రైవేటీకరణ చాందినీ తెరవెనుక
నీ వారసులు బానిసలుగా కావడానికి
చదువు ముసుగులో నైపుణ్యాలను
తర్ఫీదునిస్తున్నారు
రంగురంగుల భవిష్యత్
ప్రపంచం
ఓజోన్ పొరలా నెమ్మదిగా
చిరిగిపోతుంది
ఒక నిర్వేదంలో చిక్కుకొన్న
నిశ్శబ్దంలా
అసంకల్పిత ప్రతిచర్యను
జరుపుతుంటావు
దు:ఖపు క్రీనీడల క్రింద
కదలాడుతున్న ఉనికి చలనం
చీకటి చేతిని పట్టుకొని
జరగబారుతోంది
ఇక ఎప్పటికీ నువ్వు నువ్వు
కావు
ప్రైవేటీకరణ సాలీడు
గూడులో చిక్కుకొన్న
నిస్సహాయ మనిషీగవు.

---

## నేను

సుభాషిణి.ఎన్

నేను బహుళ అంతస్తుల
స్వంత భవనాలు కట్టుకోలేనేమో
కానీ.......
స్వచ్ఛ హృదయాభిమాన
కుటీరాల్లో వసిస్తాను.
సుందర విశాల
ఉద్యానవనాలను నిర్మించలేనేమో.
అల్లిబిల్లి ఆటపాటల
అమాయకపు పెదవులపై
చిరునవ్వుల గులాబీలు పూయిస్తాను.
కుహనా సంస్కరణల
శాసనాలను రూపొందించలేనేమో
కపోలాల్లో ఆలోచనా కుంపట్లను రాజేస్తాను.
మొసలికన్నీటి
వాగ్దాన వ్యాపారులను మార్చలేనేమో
ప్రశ్నించే గొంతుకలకు
పదును పెడుతూనే ఉంటాను
కన్నబిడ్డకు కోరిన వరున్ని కొనలేనేమో
దురాచార రక్కసిని ఎదిరించేలా



వేల మెదళ్ళకు విస్పోటన శక్తినిస్తాను
బడులు, స్టేడియంలు, లైబ్రరీలు లేకున్నా
వేలాది వ్యక్తిత్వాల్లో చొరబడతాను
సామాజిక, నైతిక, మానసిక రోగాలకు
చిరునవ్వుతో జ్ఞానమంత్రం వేస్తాను,
అదేంటో,
ప్రపంచాన నన్నేదీ ఆకర్షించదు
నా గురించి నా ప్రియతములు పలికే
మాట తప్ప
ప్రేమతో అర్పించే నమస్సు తప్ప
నేను లేని
నాడు లేదు
నేడు లేదు
రేపు లేదు
నేను
గురువును.



# అసలు ఏం జరిగింది?

ఎ. అన్నపూర్ణ

అది యుటిసి బస్‌స్టాప్. శాండియాగో నగరంలో లహోయా ప్రాంతానికి పెద్ద కూడలి. నగరంలోని అన్ని ప్రాంతాలకు వెళ్లే సిటీబస్‌లు అక్కడ కలుస్తాయి. క్రిస్ చిన్న ఉద్యోగం చేస్తున్నాడు. వీకెండ్‌లో మిరమాడ్ కాలేజీకి వెళ్ళి చదువుకుంటున్నాడు. అతను 921 నంబర్ సిటీ బస్‌లో ప్రతివారం ప్రయాణం చేస్తాడు. ఆ రోజు అలవాటుగా బస్ ఎక్కిన క్రిస్ పాస్‌ని మెషిన్ మీద టచ్ చేశాడు. కానీ బీప్ శబ్దం రాలేదు.

“నువ్వు బస్‌పాస్‌ని రెన్యూవల్ చేయలేదు” అన్నాడు బస్ డ్రైవర్ జేక్.

“సారీ మరచిపోయాను” అంటూ రెండు డాలర్ నోట్లు 25 సెంట్ల కాయిన్స్ రెండు బాక్స్‌లో వేశాడు. సీట్‌లో కూర్చుని వెంటనే సెల్‌ఫోన్‌లో పాస్‌ని రెన్యూ చేసుకున్నాడు క్రిస్.

“ఎప్పుడూ లేదు. ఈ నెల ఎలా మరచి పోయావ్ యంగ్‌మ్యాన్?” అన్నాడు జేక్.

“రెండేళ్ళుగా నేనీ బస్‌లో ప్రయాణం చేస్తూనే ఉన్నాను. నన్ను చూస్తూనే వున్నావు. పొరబాటున కూడా విడిచి పెట్టవు కదా!”

“ఎస్ మాన్. నిజాయితీ నా ప్రాణం. నిర్లక్ష్యం బద్ధం అశ్రద్ధ అంగీకరించను.”

“అవును జేక్! మంచి గుణపాఠం నేర్పావు నాకు. మళ్ళీ ఎప్పుడు పొరబాటు చేయను.”

జేక్ తన సర్వీస్‌లో నిజాయితీగా వుంటాడు. స్నేహశీలి. అందర్నీ పలకరిస్తాడు. దిగేటప్పుడు బై చెబుతాడు.

క్రిస్ ఇరవై ఏళ్ళ యువకుడు. కష్టపడే తత్వం. అతను కాలేజీకి చేరుకోవడానికి 40 ని.లు టైమ్ పడుతుంది. వీలు కుదిరినపుడు వాళ్ళు చాలా విషయాలు మాట్లాడుకుంటారు. లోకల్ న్యూస్ నుంచి ఇంటర్నేషనల్ విశేషాలవరకూ వాళ్ళ సంభాషణ సాగుతుంది. పేపర్‌లో ఈ న్యూస్ చదివావా? టీవిలో ఆ షో చూశావా? మా కాలేజీలో ఈ సంఘటన జరిగింది. బాల్బోవా పార్క్‌లో ఫెస్టివల్ గురించి డవున్‌టౌన్ పబ్లిక్ లైబ్రరీలో స్పెషల్ ప్రోగ్రామ్ గురించీ అలా ఎన్నెన్నో మాట్లాడుకుంటారు. జేక్ తెలియని సందేహాలు తీర్చుకుంటాడు. వాళ్ళు మంచి ఫ్రెండ్స్ అయిపోయారు కూడా.

ఒక రోజు జేక్ చాలా విచారంగా కనిపించాడు. అతడి పలకరింపులో మునుపటి ఉత్సాహం లేదు. ఆ రోజు బస్‌లో ఒకరిద్దరు తప్పితే జనం లేరు. వాళ్లు కూడా చివరి సీట్‌లో నిద్రకి జోగుతున్నారు.

క్రిస్ జేక్‌ని అడిగాడు.

“జేక్ ఈ రోజు నీ మూడ్ బాగున్నట్టు లేదు. ఎనీ ప్రాబ్లమ్?”

“అవును క్రిస్. మా మదర్ నాకు బాగా గుర్తువస్తోంది. వచ్చే క్రిస్‌మస్‌కి అమ్మని కలిసి తీరాలని నా భార్య గట్టిగా పట్టుబడుతోంది. అదెలా సాధ్యమో నాకు బోధపడడం లేదు. అదీ నా విచారం.”

“అంతే కదా! ప్రతీ సంవత్సరంలాగే కలుసుకోవచ్చు. మీరంతా ఎంజాయ్ చేయండి. అదేమీ కష్టం కాదుగా?”

“నాకు అంతటి అదృష్టం లేదు. మా అమ్మని కలిసి ముప్పై సంవత్సరాలకు పైగా గడిచిపోయింది. ఆవిడ ఎక్కడుందో తెలియదు. ఫోన్ నంబర్ తెలీదు. చాలా రోజుల క్రితం మా

బంధువు ఒకరు చెప్పాడు. పెన్సిల్వేనియా స్టేట్ క్లారియస్ విలేజ్‌లో వుందని."

"అరె జెక్! ఇన్నాళ్ళుగా చెప్పనేలేదు. ఇప్పుడైనా తెలుసుకోవచ్చు. మీరెందుకు దూరమయ్యారు? నువ్వు ఏమీ అనుకోకపోతే చెప్పు. నేను తెలుసుకోవచ్చా?"



"అదొక కథ. నాకు తండ్రి ఎవరో తెలీదు. తెలిసింది అమ్మ మాత్రమే. నా 14 సంవత్సరాల వయసులో చర్చిఫాదర్‌కి అప్పగించి పొరుగూరు వెళ్ళిన అమ్మ తిరిగి రాలేదు. కొద్ది రోజుల తర్వాత ఫాదర్ చెప్పారు. మీ అమ్మ వేరొక వ్యక్తిని వివాహం చేసుకుంది. నా దగ్గిరే వుంటావు. ఇక్కడ నాకు తోడుగా వుందుగాని అన్నారు. అమ్మ ఇక తిరిగి రాదని తెలిసిన రోజున గుండెలు పగిలేలా ఏడిచాను. ఆ బాధ చాలాకాలం నన్ను కృంగదీసింది. అది కోపం మారింది. అంతే ఇక ఆవిడ గురించి ఆలోచించలేదు. తెలుసుకునే ప్రయత్నమూ చేయలేదు. నా భార్య లిజియ అనాథ ఒంటరి నాలాగే. చాలా మంచి మనసు ఆమెది. మాకు ద్దరు పిల్లలు అమ్మాయి ఉద్యోగం చేస్తోంది. అబ్బాయి హైస్కూల్ చదువులో వున్నాడు. నా భార్య తరచుగా గొడవ చేస్తోంది. పిల్లలకు గ్రాండ్ మాని చూపించాలి. మనం అనాధలం కానీ మన పిల్లలు కారు. నువ్వెలాగయినా ఈ క్రిస్‌మస్‌కి మీ అమ్మని తీసుకురా. నా మాట వినకపోతే నిన్ను విడిచి పోతానంటూ బెదిరిస్తోంది. నాక్కూడా ఇప్పుడు అమ్మను చూడాలని ఉంది. క్రిస్ నువ్వు చాలా చిన్న వాడివే అయినా నీతో బాధను పంచుకుంటున్నాను." అన్నాడు ఎమోషనల్‌గా.

జేక్‌కి తప్పక సహాయం చేయాలనుకున్నాడు క్రిస్. "జేక్ మీ మదర్ ఏం పని చేసేవారు. పేరేమిటీ ఈ వివరాలు చెబితే సులువుగా మీ అమ్మ గురించి ఇంటర్నెట్ ద్వారా తెలుసుకోవచ్చు."

"అమ్మ పేరు క్రిస్టీనా టీచర్‌గా పని చేసిందని మా బంధువే చెప్పాడు. అప్పుడు పట్టించుకోలేదు. ఇంకా పని చేస్తోందా లేదా తెలియదు."

"చాలు. ఈ వివరాలు చాలు. ఆ వూరు జనాభా నాలుగువేలు మాత్రమే కనుక సులువుగా తెలిసిపోతుంది... అంటూ అయిదు నిమిషాల్లో పేరు అడ్రస్ వివరాలు ఫోన్ నెంబర్ సైతం చెప్పాడు. ఆవిడ పేరు క్రిస్టీనా జాకబ్. ఆ ఊరి పోస్టాఫీస్ దగ్గర పెద్ద భవనంలో ఒంటరిగా వుంటోంది. పిల్లలవరూ లేరు. విడో. చాలా ధనవంతురాలు. ఒంటరిగా వుంటోంది. కనుక నీ ఆసరా ఆవిడకి అవసరం కావచ్చు ఈ వయసులో."

జేక్ ఆనందానికి అంతులేదు. చాలా సంతోషించాడు. అతడి విచారం మాయమైంది.

"క్రిస్ మైడియర్ ఫ్రెండ్! థ్యాంక్యూ సో మచ్. ఈ వార్త విని నా భార్య చాలా సంతోషపడుతుంది. మేము తప్పక కలుస్తాం. ఈ క్రిస్‌మస్‌ని నీ వలన బాగా జరుపుకుంటాం. నీ మేలు ఎన్నటికీ మరచిపోను."

"జేక్. నా ప్రియమైన స్నేహితుడికి ఈ రకంగా సాయపడగలిగాను. నాక్కూడా హ్యాపీగా వుంది. వచ్చేవారం నుంచీ మాకు క్రిస్‌మస్ వెకేషన్. మా ఊరు వెడతాను. వచ్చాక వివరాలు మాట్లాడుకుందాం. "మెర్రీ క్రిస్‌మస్" అని పరస్పరం విషెస్ చెప్పుకుని విడిపోయారు.

శెలవుల తర్వాత ఊరి నుంచి వచ్చిన క్రిస్ కాలేజీకి వెళ్ళాలని బస్‌స్టాప్‌కి వచ్చాడు. 921 నం. బస్ వచ్చింది. బస్ ఎక్కాడు క్రిస్. అలవాటైన పలకరింపు వినబడలేదు. డ్రైవింగ్ సీట్‌లో వ్యక్తి జేక్ కాదు. మరో వుమన్ డ్రైవర్. జేక్ ఏమయ్యాడు అతన్ని మరో రూట్ బస్‌కి డ్యూటీ వేశారా? అతను మదర్ని కలిసిన సంతోషంతో శెలవు తీసుకున్నాడా! అసలు ఏం జరిగిందీ అనుకున్నాడు. కొంత కాలం వేచిచూద్దాంలే అని సరిపెట్టుకున్నాడు. అలా రెండు వారాలు గడిచాయే. జేక్ మాత్రం కనిపించలేదు. క్రిస్ చాలా దిగులుపడ్డాడు. ఇక వుండబట్టలేక డ్రైవర్ని అడిగాడు.

"జేక్ ఎవరో నాకు తెలియదు. నేను కొత్తగా వచ్చాను." అందావిడ. 'ఈమె ముభావి. ఎప్పుడూ సీరియస్‌గా వుంటుంది. జేక్‌లా కలుపుకోలు స్వభావం కాదు.' అని అర్థమైంది క్రిస్‌కి.

ఎంత పొరబాటు జరిగింది. ఏరోజూ అనుకోలేదు జేక్‌ని మిస్ అవుతానని. క్రిస్టీనీ ఫోన్ నెంబర్ ఆరోజు తెలుసుకున్నాను కదా. అడ్రస్ కూడా ఉంది. అని గుర్తొచ్చింది.

కాల్ చేశాడు. కానీ ఎవరూ పలకలేదు. జేక్ పేరుతో ఇంటర్నెట్‌లో వెదికాడు. కొన్ని లక్షలమందికి ఈ పేరు వుంటుంది. అయినా వెదికాడు. వారిలో బస్‌డ్రైవరు ఎవరూ లేరు. కొన్ని నంబర్లకు కాల్ చేశాడు. వారెవరూ కాదు. అతడి ప్రయత్నాలేవీ ఫలించలేదు. చివరి ప్రయత్నంగా ఉత్తరం కూడా రాశాడు. అది తిరిగి వచ్చింది. "జేక్ వాళ్ళమ్మని కలుసుకుని క్రిస్టమస్ పండుగను కుటుంబమంతా సంతోషంగా జరుపుకున్నారు" అనే ఒక్క కబురు తెలిస్తే చాలనుకున్నాడు. క్రిస్‌కి నమ్మకంగా తోచింది. జేక్ ఏదో ఒక రోజు కనిపిస్తాడని. అతను ఎదురుచూస్తూనే ఉన్నాడు.

*(రచయిత్రి ఈ కథ అమెరికా నుండి ఇమెయిల్‌లో పంపారు)*



# చరిత్ర నిదరోయే వేళ

మెర్సీ మార్గరెట్
9052809952



కొద్ది కొద్దిగా దేహంపైకి ఒలుకుతున్న చీకటిని
కాగితపు గుడ్డతో తుడుచుకుని
పుస్తకం బయల్దేరింది
ఎప్పటిలాగే ఉండటానికొక ఇల్లు వెతుక్కుంటూ

గుంపులు గుంపులుగా నడుస్తున్న జనాలను చూస్తూ
ఉక్కిరి బిక్కిరవుతున్న మనుషుల్ని పలకరిస్తూ
చినిగిన దుస్తుల్లో
దుమ్ము తెరల్లో
కోడిపిల్లల్లా ఆడుతున్న వాళ్ళకు
తన దేహంలోంచి చించిన కొన్ని గుడ్డలిచ్చి
పుస్తకం బయల్దేరింది
ఎప్పటిలాగే ఉండటానికి ఒక ఇల్లు వెతుక్కుంటూ

ఇల్లు కావాలని అనుకోనిదెవరు?
ఉండడానికింత స్థలం
ఎండావానలతో తలపడకుండా తలదాచుకోడానికి
ఇంత జాగా ఉండాలని కోరుకోనిదెవరు?

ఆ రోజు వర్షం వెలిశాక
రంగులీనుతున్న సాయంత్రం
కవితలు వరదల్లా పొంగే సాయంత్రం
చలచల్లని గాలులు గిలిగింత పెడుతూ జ్ఞాపకాల సెగ రేపే
సాయంత్రం
కలం కళ్ళని తన కళ్ళతో కలిపి భావాలను దొంగిలించే
సాయంత్రం
లోకం చీకటి దుస్తుల్ని వేసుకునే ఆ సాయంత్రం
ఒక ఇంటికోసం ఆలోచిస్తూ ఆ పుస్తకం ఎంతలా
తిరుగుతోందో

ఓ ఇంటికి
హిందువుగా పుట్టినందుకు గర్వపడమని స్టిక్కర్ అతికించి
హిందువులకే ఇళ్ళని ఉంటే
కుక్కలున్నాయి జాగ్రత్త అనే బోర్డు కిందే
బ్రాహ్మణులకు శాఖాహారులకు మాత్రమే ఇళ్ళని
మరో చోట బోర్డులు చూసి
ఆశ్చర్యార్థకపు మొహంతో తిరుగుతుంది పుస్తకం

ఇల్లంటే తండ్రి లాంటి రక్షణ
తల్లి లాంటి లాలన
చేతులు పెనవేసుకుని నిల్చునే
పచ్చని జ్ఞాపకాలు పెనవేసుకున్న గోడల జీవన
కాని ఇప్పుడు
ఇల్లు కూడా రాజకీయ పొత్తు
లెక్కలేని గోడల మధ్య బంధీ అయిన సొత్తు

పుటలలో చరిత్ర నిదరోయే వేళ
సురక్షితంగా ఉండగలిగే ఒక్క ఇల్లు కూడా దొరకలేదే అని
వెనుదిరిగే వేళ
ఎదురొచ్చిన బలమైన బాహువులు
తనని ఈడ్చు కెళ్ళి
తుడిచొచ్చిన చీకట్లోకే నెట్టేస్తుంటే
రక్తసిక్తమైన పెదాలతో మొహంపై దెబ్బలతో
"ఏంటిది?? ఏం చేస్తున్నారని
పుస్తకం నిట్టూరుస్తూ ప్రశ్నించింది"

చీకటి ఉరితాడును పేనుతూ
రాజకీయ రంగు పూసుకొని
వికృతంగా మారి వికటాట్టహాసం చేస్తూన్న స్వరం
వెకిలిగా నవ్వుతూ అంటుంది కదా
ఇది "ఘర్ వాపసి"
ఇది "ఘర్ వాపసి"




# వాడిని జయించాలి

- డా॥ జోశ్యుల కృష్ణబాబు
9866454340

నేటి సమాజంలో వివిధ రూపాల్లో విస్తరిస్తున్న అవినీతిపై గురిపెట్టిన ఒక సుదీర్ఘ కవితాస్త్రమే అడపా రామకృష్ణ రాసిన "వాడిని జయించాలి" అన్న దీర్ఘకవిత. తెలుగులో వివిధ వాదాలకు భిన్నంగా, సమాంతరంగా సంఘటనాత్మక కవిత్వం అనేది ఒకటి వెలువడటం మనం గమనిస్తున్నాం. అంటే సమాజంలో ఏదైనా ఆలోచింపజేసేది, మనసును కదిలించేది, బాధపెట్టేది, సంతోషింపజేసేది అయిన ఒక గట్టి బలమైన సంఘటన జరిగినప్పుడు వెంటనే సమాజం స్పందిస్తుంది. ఉద్యమాలు నడుస్తాయి.

అలా నేడు దేశంలో వివిధ కోణాల్లో జరిగే అవినీతిపై అన్నా హజారే, కేజ్రీవాల్ వంటి వారు అలుపెరుగని పోరాటాన్ని సాగించారు. వారు విజయం సాధించారా? లేదా? అన్న ప్రశ్న ఇక్కడ ముఖ్యం కాదు. కనీసం ప్రజల హృదయాల్లోకి ఈ విషయాల్ని చాలా గట్టిగా వాళ్ళు తీసుకువెళ్ళగలిగారు. ఇప్పుడు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు కూడా అవినీతిని ఎండగడతాం! అన్న నినాదంతోనే గద్దెనెక్కాయి.

అయితే రామకృష్ణ రాసిన "వాడిని జయించాలి" అనే దీర్ఘకవితలో ఈ సమాజంలో ఎన్ని అవినీతి కోణాలు ఉన్నాయో అన్నిటినీ ఒక్కచోట చేర్చి మొత్తం అన్నింటి పైనా యుద్ధాన్ని ప్రకటించారు. ఇక్కడ వాడు అంటే అవినీతిపరుడని అర్థం.

న్యాయవ్యవస్థ, భూకబ్జాలు, సెజ్‌లు, ఇసుక మాఫియా, పరీక్షాపత్రాల లీకేజీ, రియల్ ఎస్టేట్ రంగంలో జరిగే అవకతవకలు, వైద్యరంగంలోనూ, చలన చిత్రరంగంలోను, క్రీడారంగంలో కనిపించే అవినీతి, హైవేల్లో జరిగే ప్రమాదాలు పర్యావరణ పరిరక్షణ పేరుతో లక్షల్లో జరిగే అవినీతి, ఆయుధాల కొనుగోళ్ళలో, దేవస్థానాలలో, ధృవీకరణ పత్రాల విషయంలో జరిగే అవినీతి భాగోతాల్ని ఇలా ఒక్కటి కూడా విడిచి పెట్టకుండా అన్నింటి పైనా ఒకే ఒక్క పాశు పతాస్త్రాన్ని సంధించారు కవి.

"చట్టం అందరి దృష్టిలోనూ సమానమే" "చట్టం తన పని తాను చేసుకు పోతుంది" అంటూ చట్టం ఎంత పవర్‌ఫుల్‌గా పని చేస్తుందో నాయకులు తరచూ ఊకదంపుడు ఉపన్యాసాలు ఇస్తుంటారు. కాని గతంలో ఒక ప్రసిద్ధ సినిమా హీరో ఇంట్లోను, ఒక ప్రసిద్ధ రాజకీయ నాయకుని ఇంట్లోను హత్యా ప్రయత్నాలు జరిగాయి. ఆ యిద్దరూ కూడా ఆ సంఘటనలు జరగ్గానే హార్ట్‌పేషెంట్లుగా కార్పొరేట్ హాస్పిటల్స్‌లో జాయిన్ అయిపోయారు. తరువాత ఆ కేసులు కొట్టేశారు కూడా. అలాగే చుండూరు మారణ హోమంలో అంతమంది దళితుల్ని ఊచ కోత కోస్తే, ఆ కేసులో అందర్నీ నిర్దోషులని కోర్టు నిర్ణయించింది. మరైతే ఆ హత్యలు చేసిందెవరు? అన్న ప్రశ్న ప్రశ్నగానే మిగిలిపోయింది. ఇలాంటి న్యాయవ్యవస్థను గూర్చి కవి

**న్యాయం నగుబాటు కాని / చట్టం ఒక వెసులు బాటు అవని**

**బెయిల్ పొందడం స్ట్రాటజీ / జైల్లో ఉండటం ప్రిస్టేజీ ఇమేజ్**

**ప్రమాణాలపై ప్రాధాన్యమెంత? / ఎటూ తూగని తూనిక బరువెంత?**

**న్యాయదేవత తీర్పు విలువెంత? / తెల్లచొక్కాపై నల్లకోటైనా**

**వాడి మాటే నెగ్గాలి జతకట్టైనా** అంటారు. ఒక ఉన్నత స్థాయి వ్యక్తికి శిక్షపడిందంటే అంతకంటే ఉన్నత స్థాయి వ్యక్తి హస్తం అక్కడ ప్రత్యక్షంగానో పరోక్షంగానో ఉండి తీరాలన్న విషయం కూడా మనకు అర్థమవుతుంది.




ఇక 'కబ్జా' అనే మాట నేడు చాలా తేలికైపోయింది. అది ప్రభుత్వంది కాని, ప్రైవేటుది కాని అవినీతి పరుడి కన్ను పడిందంటే అది వాడి అకౌంట్‌లో పడిపోవలసిందే. అది ప్రభుత్వానిదైతే అధికారుల జేబులు నింపో, వారిని బెదిరించో వాళ్ళ నోరు మూయిస్తాడు. అదే అమాయకులైన ప్రైవేట్ వ్యక్తులదైతే వాడి పంట పండినట్టే. మన ఇంట్లో మనం ఉండగానే మన ఇల్లు కూడా ఆన్‌లైన్‌లో దొంగ రిజిస్ట్రేషన్ చేయించేసుకోగలడు. ఆపై దశాబ్దాల తరబడి న్యాయపోరాటాలు, చేసే ఓపికలేక, వాడితో యుద్ధం చేయలేక వాడు దయదలచి ఎంత ఇస్తే అంతే మహా ప్రసాదంగా భావించడం నేడు సర్వసాధారణ మయిపోయింది. అలా ఒకటి రెండు కబ్జాలతో వాడి దాహం తీరదు. అందుకే కవి

**కబ్జా చేయడం ఓ దర్జా కంచె వేయడం ఓ దౌర్జన్యం / వాడికోరిక ఓ ఉన్మాదం**

**వాడి తీరు ఓ ఉద్రేకం / అడ్డంకుల్ని తొలగించుకోవడం**

**ఆకాశ హర్మ్యాల్ని చుట్టేయడం / పొద్దుల్ని చెరిపేయడం**

**వాడు సంచరించని ప్రదేశం లేదు / పాగా వేయని చోటు లేదు.** అంటూ అక్షరీకరిస్తారు కవి.

ఇక ఇసుక మాఫియా. దొంగలూ దొంగలూ కలసి ఊళ్ళుపంచుకొన్నట్లుగా ఇసుక వేలం పాటల్లో అందరూ సిండికేటుగా కుమ్మక్కైపోతారు. ఆ పాట ఎవరికి రావాలో, ఎంతకి రావాలో ముందే నిర్ణయమైపోయింది. ఫలితంగా ప్రభుత్వ ఆదాయానికి పెద్దగండి ఏం చేయలేని పరిస్థితి. అదే విషయాన్ని

**ఇసుక మాఫియాలో వేలం వేస్తాడు / ఒకటో సారి పాటకు కనబడడు**

**రెండోసారి పాటకు తడబడడు / మూడోసారి పాటకు ఎగబడతాడు**

**సిండికేట్ల జులం పోరుతో / వేలాది కోట్లు మట్టి కరిపిస్తాడు.** అంటూ ఇసుక పాటల ప్రహసనాన్ని కళ్ళముందుంచుతారు కవి.

ఇక నేటి పరీక్షలు, సిలబస్‌లు, పేపర్ లీకేజీలు – ఇంకా ముందుకు వెళితే ఫేక్ యూనివర్శిటీలు, మార్కెట్లో డూప్లికేట్ సర్టిఫికేట్లు – ఇలా ఉంది. నేటి చదువుల వ్యవహారం. లీకేజీవీరుల్ని కంట్రోల్ చేయలేని ప్రభుత్వం చివరికి ప్రతి పేపరు, 2లేదా 3సెట్లు తయారుచేయడం, పరీక్షకు అరగంట ముందు డ్రా తీసి ఏ సెట్లో తేల్చడం వంటి చాలా తలనొప్పి వ్యవహారాలను పరీక్షలను నిర్వహించే కళాశాలలకు తెచ్చి పెట్టాయి. దాన్నే కవి

**నేల బారు పరీక్షల పుణ్యం / పసలేని సిలబస్‌తో ప్రావీణ్యం / వీధిపాలైన పరీక్ష పేపరు / బేరసారాలకు అంతా హుషారు / వందశాతం గట్టెక్కిపోవడం / చదువుల రంగంలో గెలవడం**

**తెరవెనుక నడిచే భాగోతం / వాడు తవ్విన బోరు బావిలో ఊపిరాడని అభాగ్యులెందరో** అంటారు. ఇక్కడ బోరు బావి అంటే బోరుబావి కాదు. భవిష్యత్తు. ఇలా విద్యావిధానం వల్ల ఆ విద్యార్థికి బోరుబావిలో పడి ఊపిరాడని స్థితి ఎదురౌతుందనే ధ్వని ఇందులో కనిపిస్తుంది.

"వైద్యోనారాయణో హరి:" అన్నారు. అవినీతి, నిర్లక్ష్యం–ఎక్కడున్నా కొంత ఫరవాలేదు. తక్షణ నష్టం వాటిల్లకపోవచ్చు. కాని వైద్యం విషయంలో ఇది ఉండకూడదు. ఎందుకంటే ఎన్ని కోట్లు ఖర్చుపెట్టినా పోయిన ప్రాణం తిరిగిరాదు. ఈ విషయాన్నే కవి ఇలా అంటారు

**నిర్లక్ష్యంతో తప్పుడు రోగ నిర్ధారణ / లక్షల్లో బిల్లులు సమర్పణ**

**ప్రాణం ఒక పిపీలిక ప్రాయంగా / ఊపిర్ని నొక్కేయడం అతి సహజంగా**

**అవినీతి ఎంగిలి మెతుకులకి / సమయం సందర్భం లేదు. ఎప్పటికీ...** అనంటంలో రోగి ఎలాంటి దుస్థితిలో ఉన్నా అవినీతి దెబ్బకు గురి కాక తప్పదన్న విషయం అర్థమవుతుంది.

అలాగే పచ్చని చెట్లును కూల్చేసి 4లైన్లు, 6లైన్లు హైవే

రోడ్లుగా మార్చటం, మద్యం సేవించి ఆ హైవేలో అతి వేగంగా ప్రయాణించి యాక్సిడెంట్స్‌కి గురి కావటం, ఎందరో అసువులు బాయటం రోజూ పేపర్లో చూస్తున్నాం. కవి వీటన్నిటినీ కూడ చూడలేదు.




***వృక్షాల్ని పెకలించిన ప్రొక్లయిన్లు / హైవే రోడ్లుగా మార్చిన ఘనులు / మద్యం కునకులో ఊగిసలాడి / ఎదురొచ్చే బండి మసకబడి / రక్తపు మడుగుల్లో ఊపిర్లాగి / వందలు వేలు స్మశానాలకేగి / అనాథలైన కుటుంబాలెన్నో / నఖిలీ లైసెన్స్‌ల చలామణి / వాడివాటాకి నిత్యం కసరత్తు బోణి.*** అంటూ వాహనాలకు, వాహన చోదకులకు కూడా లంచం తీసుకొని నకిలీ లైసెన్సులు జారీ చేసే అవినీతి అధికారుల తీరును ఎండగొట్టడం జరిగింది.

నేడు చలన చిత్రరంగం కూడ మాఫియా అవినీతి పరుల చేతుల్లోనే బిగుసుకుపోయింది. ఏ సినిమాకి ఎవర్ని హీరోగా, లేదా హీరోయిన్‌గా పెట్టాలి? ఎవరు డైరెక్ట్‌చేయాలి వీటిని నిర్ణయించేది వాడే. అనగా మాఫియా వీరుడే. అంటే అవినీతి పరుడే. వాడి గురించి చెబుతూ

***టాలీవుడ్‌లో హంగామా చేస్తూ/హాలీవుడ్‌లో ఛీర్స్‌కొడుతూ/ మాఫియాన్ని ప్రొడ్యూస్ చేస్తూ/చలన చిత్ర రంగాన్ని శాసిస్తూ/ అకృత్యాలకు పావులు కదుపుతాడు/అంతటా అవినీతిని పోషిస్తుంటాడు*** అంటారు. ఇటీవల అయితే ఏ సినిమా ఎన్ని రోజులు ఆడాలి? ఎప్పుడు తీసేయ్యాలి? అన్నది కూడ ఈ మాఫియా అవినీతి లీడర్లే నిర్ణయించడం చూస్తున్నాం.

ఇక సెజ్‌లు. గంగవరం, సోంపేట, కాకరాపల్లి ప్రాంతాలలో విద్యుత్ ప్లాంటుల కోసం కార్పొరేట్ సంస్థల ఒత్తిడులకు తలవొగ్గి ప్రభుత్వం పేదల, రైతుల స్థలాలను పేదల హస్తగతం చేసుకుంది. వేదనలు ఆరణ్యరోదనలే అయ్యాయి. ఆ సంఘటనలు కవిని ఊరుకో నియ్యలేదు. అందుకే కవి, గంగవరం రోదనలతో ప్రతిధ్వనించినా, అణువిద్యుత్ మంటలు రేగి కాకరాపల్లి కడతేరిపోయినా, ప్రశాంత జీవితం విషాదాంతమైనా, వాడు పుడమితల్లిని కడతేర్చి, మట్టి బ్రతుకుల్ని చిదిమేయగలడని వాపోతోడు. అంతేకాదు.

***భూమిని నమ్ముకొన్న భూస్వామినైనా***
***తరిమికొట్టే దినసరి కూలీని చేస్తాడు*** అంటూ ప్రభుత్వం ఎంత సేపు అమాయకులపైనే యుద్ధం చేస్తుంది కాని, ధనవంతుల, అధికారుల, నాయకుల అండదండలున్న అవినీతి పరుణ్ణి ఎంత మాత్రం ఎదుర్కోలేదంటూ ఆవేదన వ్యక్తం చేశారు. అన్ని రంగాలలో ప్రవేశించిన అవినీతి క్రీడా రంగాన్నే వదిలిపెట్టలేదని చెబుతూ

***తెర ముందు వెనుక బెట్టింగ్ గోల్ / దాదాల మధ్య ఫిక్సింగ్ వాల్/పోటీకి తలపడే ఫ్రాంఛైజీలు / వేలం గేలంలో గుంజీలు/హోటల్ రూముల లావాదేవీలు / బుల్లితెరకు చెక్కిన పైరవీలు*** అంటూ క్రీడారంగం ఎలా అవినీతి మయమైందో వివరిస్తారు. అలాగే నిరంతరం దేశాన్ని రక్షించడానికి తమ ప్రాణాన్ని పణంగా పెట్టే సైనికులు ఉపయోగించే ఆయుధాల్లో కూడా అవినీతి ప్రవేశించి, ఆ కారణంగా అవినీతి పనికి రాకుండా పోయి వారు ప్రాణాల్ని కోల్పోతున్న వైనాన్ని కనిపెట్టే కవి

***పదిహేనేళ్ల కార్మిక వార్‌కు / కదులుతున్న శవపేటికల కవర్‌కు***

***తెగిపోని అవినీతి సంకెళ్ళు/బూజెక్కిన ఆయుధాల కొనుగోళ్ళు/పేలకుండా మొండికేస్తున్న శతఘ్నులు/పిదపకాలం దాపురించిన యుద్ధనౌకలు/శృతిమించిన కొనుగోళ్ళలో కమిషన్లు/వాడికి పోసగదు దేశ భద్రత*** అంటూ అక్కడి అవినీతిని కూడా వదిలిపెట్టలేదు. ఇది చదువుతుంటే మనకి భోఫోర్స్ కుంభకోణం గుర్తుకు రాక మానదు.

ఈ విధంగా నేటి సమాజంలో ఎన్నికోణాల్లో అవినీతికి అవకాశ ముందో అన్ని కోణాల్ని ఈ కవి బట్టబయలు చేశారు. అయితే ఈ అవినీతి ఇలా వేళ్ళూనుకుంటూ పోవటమేనా? దీనికి విరుగుడు లేదా? దీన్ని అంతం చేసే మార్గమే లేదా? అని ప్రతిపాఠకుడికి అనిపిస్తుంది. దానికి సాధ్యమైనంత సొల్యూషన్‌ని కూడా కవి చెప్పాలి. అది అతని బాధ్యత. చివరిగా కవి ఇలా అంటారు.

***మేధావులు, ఉన్నతులు మౌనం వహిస్తే***
***మూర్ఖుడు మహోన్నతుడవుతాడు*** అందుకని చేతులు కట్టేసుకొనే ఉదాసీనతకు, కళ్ళుమూసుకొనే నిర్లిప్తతకు, చెవుల్లో సీసం పోసుకొనే స్తబ్దతకు తెరదించాలి. అందుకు జడపదార్థం కాని మనిషి కావాలి. పోరాట పటిమగల ధీరుడు కావాలి. ధిక్కార స్వరం వినిపించాలి. వాడిని జయించాలి, అంటారు కవి. తప్పక అలాగే అవినీతిని జయించే రోజు కోసం ఎదురు చూద్దాం!



# ఈ పల్లెకు రావొద్దండి...!!



-సడ్లపల్లె చిదంబర రెడ్డి
9440073636

కోళ్లని, దూళ్లని,
కుక్కల్ని సూసుకోమని
కాటికి కాళ్లు సాపిన ముసల్దాన్ని
నన్నీ కొంపకి కాపలా పెట్టి
కాలే కడుపులు మోస్కోని
పట్నం దావ బట్టి
యన్నాళ్లాయరా పెద్దోడా!!
సన్నోడా మనవడా!!

మీరేమో ఆడ-
నోట్ల కోట్లు సంపాదన సేసే
మాట్ల మారాజులు
కాళ్లతో సూపే పనుల్ని
కళ్లకదూకోని సేతుల్తో సేస్తా
నాలుగు కాసులు
సంపాదన సేస్తా వుండారు.
కాలము గడుపుతా వుండారు.

అప్పయ్యా!! తట్టలో
సంగటిముద్ద వొడ్డిచ్చుకొంటే
మీరే గుర్తుకొస్త్రారా అయ్యా!!
యకరాలకెకరాలకి
మారాజులు మీరే
నేల దుమ్ము నెత్తిన కొట్టుకోని
యన్ని పుట్ల దవసం పండిచ్చి
కమ్మగా తిని యా పొద్దు
కంట్నిండా నిద్ర పోతిరప్పా??

వాన వాన రాలే
నీళ్ల నీళ్ల లేవు
ఎండె ఎండె పంట్లు
నెత్తిన పడె రాళ్లు
గడ్డి లేక ఎద్దులు సచ్చె
పిండే ఎనుములు వొట్టి పాయ
అప్పులు కొండంత బరువులాయ.

దేవుని పటాలు మెడకి తగిలిచ్చుకోని
తత్వాలు పాడుకొంటా కొందరు,
ఇల్లు కాలి బూడిదయ్యింది
పెండ్లాము సావుబతుకుల్లో వుంది
దర్మం సేయండి అని కొందరు,
బస్టాండుల్లో మూటలు మోస్తా కొందరు

అవి సేయలేని ఆత్మాబిమానం జనాలు
ఇసం గుళికలు మింగో,
సెట్టును ఉరి మాన్ను సేసుకోని
పర లోకానికి
పయానం గడతా ఉండారు.

నేనీ పల్లె కొంపలో కండ్లు తెర్సి
యనభై యేండ్లాయ- యా
ఇరవై ఏండ్లగ్గానీ
కరువుదీర వాన్లు పడ్లే!!
సెరువులు నిండి మరవలు పార్లే!!
ఏర్లు పొంగి పల్లె రైతులు
పండగలు సేయలే!!
పల్లె లన్నీ దిక్కులేని బతుకులే
ఈడ జనాలంతా
గాల్లో ఆరిపోయే దీపాలే!!

మాది ఇంతలావు, ఇంత పొడువు అని
ఒగడు పోతే ఇంగొగుడు
ఒగ జండా మాసి పోతే
ఇంగొగు జండా కింద
ఒగ పార్టీ సస్తే
ఇంగొగ పందుల గుంపులో సేరి
అయిదేండ్ల కొగసారి
కండువాలు మార్సుకోని
కొత్త కొత్త మట్లు నేర్సి
నక్కల జాతికి పుట్టిన
కుక్క మూతి నాకిళ్ల నా కొడుకులు
దుమ్మలగొండి గుంపుల మాదిరీ తయారై
బాగ తిన మరిగిండారు- ఈళ్ల
నాలికలు తెగ్గోయ!
ఈళ్ల కండ్లల్లో కొరివి కారం కూర!!

ఈ జాతోల్లు జనాల్ని పరిపాలించేకి కాదు
పై పీకా లెక్కేది
పందుల మాదిరీ తిని బలిసేకి!

మీ రీ పల్లెకు రావొద్దండి- మీ కాళ్లకి
మొక్కుతా
నేనూ ఈ పల్లే
యనకా ముందూ
సావుకు సిద్దమయ్యిండాము!!

## కె.వి.ఆర్. డిటెన్యూ డైరీ



కె.వి.ఆర్., శారదాంబ స్మారక కమిటి

వెల : 170/- పేజీలు: 340

ప్రతులకు : 9849083137

తెలుగులో ఇది తొలి ప్రయోగం. ఇది వ్యక్తిగతమైన దినచర్య కాదు. దేశ రాజకీయ సాంఘిక పరిస్థితుల మీద, అనేకానేక సమకాలీన సంఘటనలపైన ఇదొక గచ్ఛద్వ్యాఖ్య. ఎన్నో పుస్తకాల మీద, సాహిత్య ధోరణుల మీద, సాహిత్యకారుల ధోరణుల మీద ఇదొక సమీక్షా గ్రంథం.

– ఝంఝు ప్రచురణలు

## డా॥ బి.ఆర్. అంబేడ్కర్ బెర్ట్రాండ్ రస్సెల్, విలియం వర్డ్స్ వర్త్



డా॥ కత్తి పద్మారావు

వెల : 200/- పేజీలు: 265

ప్రతులకు : 9849741695

అంబేడ్కర్ వ్యక్తిత్వంలోని బహు పార్శ్వాలకు నేను ఉత్తేజితుడనయ్యాను. బెర్ట్రాండ్ రస్సెల్ జీవితంలోని హేతువాద దృక్పథం నన్ను ప్రభావితం చేసింది. విలియం వర్డ్స్‌వర్త్‌లోని ప్రకృతి వర్ణన నన్ను ఆకట్టుకుంది. నా కవిత్వాన్ని ప్రభావితం చేసింది. ఈ ముగ్గురి వ్యక్తిత్వాలు సమున్నతమైనవి. సముజ్వలమైనవి. సముత్తేజమైనవి. ఈ ముగ్గురినీ ప్రపంచంలో ఉన్న ప్రతి ఒక్కరు చదవాల్సి ఉంది.

– డా॥ కత్తి పద్మారావు

చినుకు సంపాదకీయాలు (2010-2015)

## వర్తమానం



నండూరి రాజగోపాల్

వెల : 90/- పేజీలు: 168

ప్రతులకు : 99848132208

ఇవాళ తెలుగు అంటే అందరికి ఒక చిన్న చూపు. ప్రక్క రాష్ట్రాల భాషలలో పుస్తకాలు కనీసం మూడేసి వేలు అమ్ముతుంటే, మనం వేసిన పుస్తకాలు కేవలం వంద కూడా అమ్మలేక పోతున్నామంటే మనం ఎక్కడ ఉన్నామో ప్రశ్నించుకోవాలి. సాహిత్యాన్ని, రచయితలని, సాహిత్య గ్రంథాలని మనం రక్షించుకొంటే తెలుగు భాష వెయ్యేళ్ళేమిటి? భూమి ఉన్నంత వరకు ఉంటుంది.

– నండూరి రాజగోపాల్

## ఖమ్మం కథలు (1911-2016)



సంపాదకురాలు: జ్వలిత

వెల : 400/- పేజీలు: 672

ప్రతులకు : 9989198943

ఇది స్థానిక చరిత్రల యుగం, స్థానిక సాహిత్యాల పునర్జన్మ కాలం. ఈ నేపథ్యంలో ఖమ్మం కథలు చదవాలి. అయితే, మామూలు సంకలనాల కంటే ఇలాంటి స్థానిక సంకలనాలను తీసుకురావడం కష్ట సాధ్యం. కత్తి మీద సాము! ఖమ్మం కథలు సంకలనం తొలి కథ నించి ఇప్పటి తాజా కథ దాకా చదువుతున్నప్పుడు ఈ సంకలన కర్త జ్వలిత శ్రమ ప్రతి పుటలోనూ కనిపిస్తుంది.

– అఫ్సర్

గంటేడ గౌరునాయుడి సాహిత్య పరామర్శ

## నాగలిజాడ



సంపాదకుడు: అట్టాడ అప్పలనాయుడు

వెల : 150/- పేజీలు: 192

ప్రతులకు : 9441415182

కథ, కవిత, పాట, యాసపీఠం అనే కాలం... రచనలతో గౌర్నాయుడు సృజించిన సాహిత్యాన్ని, గౌర్నాయుడు జీవించిన కళింగసమాజాన్ని మనకు మరొక్కసారి వారివారి దృష్టికోణాల నుంచి చూపిస్తారిందులో వ్యాసకర్తలు.

– అట్టాడ అప్పలనాయుడు

## మానవీయ ఉపాధ్యాయుడు



డాక్టర్ శివార్చక విజయకుమార్

వెల : 225/- పేజీలు: 232

ప్రతులకు : 7032875756

నే చదివిన పుస్తకాల సారాన్ని, ఉపాధ్యాయ మిత్రుల సాహచర్యంలో పొందిన అనుభవాలను మేళవించి మార్పుకు శ్రీకారం చుడుతుందన్న చిరు ఆశతో 'మానవీయ ఉపాధ్యాయుడు' అన్న పుస్తకాన్ని మీ ముందుకు తీసుకురావడం జరిగింది.

– డా॥ శివార్చక విజయకుమార్

## మూడవ మనిషి (దీర్ఘకవిత)




**రేణుక అయోల**

వెల : 50/- పేజీలు: 53

ప్రతులకు : 9963889298

రేవతి నవల లాంటి ఒక హిజ్రా జీవితాన్ని రేణుక అయోల ఈ దీర్ఘ కవిత ద్వారా ఆవిష్కరించడం, సహానుభూతి, ఒక బాధిత వర్గ దుఃఖాన్ని, ఆవేదనని, ఆక్రోశాన్ని తనదిగా భావించి, తనలో ఆవాహన చేసుకుని ఆ ఘర్షణ నుంచి రేణుక రచించిన దీర్ఘ కవిత ఒక జీవిత కథని, కన్నీటి వ్యధని ఆవిష్కరించింది.

– డా. ఎమ్. వినోదిని

## కొన్ని నక్షత్రాలు కాసిన్ని కన్నీళ్ళు




**విమల కథలు**

వెల : 120/- పేజీలు: 215

ప్రతులకు : ప్రముఖ పుస్తకాల షాపులు

ఈ కథలు చదువుతున్నంత సేపూ ఒక దిగులు, బెంగ, బాధ ముసుర్లా మనసును కమ్మేస్తాయి. తేరుకోవటం తేలిక కాదు. ముగింపులేవీ ముగింపులు కావు. కొత్త కథల గురించిన ఆలోచనకు పరచిన మొదటి మెట్టు. ఆ ముగియని కథల వేదన పాఠకులలో కొనసాగుతూనే ఉంటుంది. నవ్వుతున్న నల్ల పిల్లలు మనకు కనిపిస్తూనే ఉంటారు.

– ఓల్గా

## పారేయాల్సిందే! (కవిత్వం)




**నూతలపాటి వెంకట రత్నశర్మ**

వెల : 40/- పేజీలు: 58

ప్రతులకు : 9866376050

తను చూసిందాన్ని, తననుభవం నుంచి వడకట్టి కవితలుగా మన ముందుంచారు. సరళంగా, హాయిగా పలకటం ఉంది. నిర్దిష్ట అభిప్రాయాలు, నిర్దిష్టంగానే వ్యక్తమయ్యాయి.

– శివారెడ్డి

## చెమట ప్రవాహమై పారినా...




**మహ్మద్ ఖాజామైనద్దీన్**

వెల : 100/- పేజీలు: 78

ప్రతులకు : 9396626276

...మాజిక చైతన్య దృక్పథం, మానవాళి ...తే ముఖ్య సూత్రాలు. ఇలావుంటే ఆ ... ఏ మతం వాడైనా, ఏ కులం వాడైనా, ...నా, సమాజం తప్పక గుర్తిస్తుంది. ... సత్కరిస్తుంది. ఆ కవిత్వం సన్మానింపబడుతుంది. సందేహం లేదు.

– ఉమ్మెతల

(సమిష్టి శతకం)

## చిట్టి మనసులు




**తొమ్మిదో తరగతి - ప్రభుత్వ ఉన్నత పాఠశాల, నరసన్నపేట, శ్రీకాకుళం జిల్లా**

వెల : 30/- పేజీలు: 62

మూడు నాలుగు కాలవ్యవధులలో ఆటవెలది పద్యం నడకను పట్టుకున్నారు పిల్లలు. రెండు రోజుల పాటు నాలుగైదు పద్యాలు సామూహిక కృషితో సమిష్టిగానే కట్టారు. మూడోరోజు నుంచీ వ్యక్తిగతంగా ఎవరికి వారు పద్యాలు రాయాలని సూచించాను. కలిపి శతకం పూర్తి చేద్దామన్నాను. ఏ సూచనా సలహా లేకుండానే మకుటాన్ని వాళ్ళే సమకూర్చుకున్నారు.

– ప్రజాసాహితి నాగరాజు

## జ్ఞాపకాలే ఊపిరిగా వెలుగు జాడను వెంబడిస్తూ




**(దీర్ఘ కవిత)**

**ఎస్.ఆర్. పృథ్వి**

వెల : 50/- పేజీలు: 40

ప్రతులకు : 0883-2421123

2015, సెప్టెంబరు 6, అశీతి ప్రారంభం నాటికే, మా ఇరువురి నడుమ వున్న కొన్ని అనుబంధాలను ఒక దీర్ఘ కవితగా వ్రాసాను. ఉగాది కానుకగా మాస్టారికి సమర్పించి, ఆశ్చర్య పరచాలను కున్నాను. ఆ సన్నివేశాన్ని కోల్పోవటం దురదృష్టం.

– ఎస్.ఆర్. పృథ్వి

# అనంతపురంజిల్లాలో సాహితీస్రవంతి ప్రస్థానం




అనంత ప్రస్థానం కవితా సంకలనం ఆవిష్కరణ సభలో సింగమనేని నారాయణ, మేడిపల్లి రవికుమార్, కుమారస్వామి

పి. కుమారస్వామి

సుమారు పద్దెదు సంవత్సరాల క్రిందట సాహిత్య ప్రస్థానం పత్రిక ఆవిష్కరణ సభతో అనంతపురం జిల్లాలో సాహితీ స్రవంతి ప్రస్థానం ప్రారంభమైంది. డా.గేయానంద్, డా. మోక్షప్రసూన, పిళ్ళా కుమారస్వామి రెడ్డి లతో సాహితి స్రవంతి కోసం ఏర్పడిన కన్వీనింగ్ కమిటీ 2002 నుండి పని చేయడం ప్రారంభించింది. అప్పటి నుండి శ్రీ శ్రీ, జాషువా, గురజాడ వర్ధంతి, జయంతులను క్రమం తప్పకుండా సాహితీ స్రవంతి జిల్లా కమిటీ నిర్వహిస్తూ వస్తోంది. 2003 లో అమెరికా ఇరాక్ పై యుద్ధాన్ని ప్రకటించినప్పుడు ప్రపంచ వ్యాప్తంగా దీనిపై నిరసన వ్యక్తమైంది . ఆ నేపథ్యంలో జిల్లాలో సాహితీ స్రవంతి 'యుద్ధవ్యతిరేక కవితాగళాలు' పేరుతొ ఇరాక్ పై అమెరికా యుద్ధాన్ని వ్యతిరేకిస్తూ కవిసమ్మేళనం నిర్వహించింది

'అనంతపురం జిల్లా వెనుకబాటుతనం- నిర్మూలన' పై కవి సమ్మేళనం నిర్వహించింది. కులవివక్ష వ్యతిరేక పోరాట కమిటీ జిల్లాలో సామాజికన్యాయం ,కులవివక్ష అంశాలపై సైకిల్ యాత్ర నిర్వహించిన సందర్భంలో సాహితీస్రవంతి "కులవివక్ష పై కవితాసమరం" పేరుతో కవిసమ్మేళనం నిర్వహించింది. వివిధ డిగ్రీ కళాశాల విద్యార్థులకు కథ, కవిత్వ రచనలలో పోటీలు నిర్వహించింది . తరువాత జిల్లాలో పేదలు చేస్తున్న భూపోరాటానికి అక్షర సంఘీభావం పేరిట శ్రీశ్రీ వర్ధంతి రోజున కవిసమ్మేళనం నిర్వహించింది . కమిటీలోకి హరికృష్ణ (కేకె ),ఎస్వీ ప్రసాదులను కలుపుకొని కార్యక్రమాలను నిర్వహించింది.

సెప్టెంబరు 5 ఉపాధ్యాయ దినోత్సవం సందర్భంగా ఉపాధ్యాయులకు కథ ,కవిత ప్రక్రియల్లో సాహిత్య పోటీలు నిర్వహించి బహుమతులను అందజేయటం ప్రారంభించింది. జీవితభీమా సంస్థలో కడప డివిజన్ లోని అనంతపురం, కడప, కర్నూలు జిల్లాలోని వుద్యోగులందరికి కవితల పోటీలు నిర్వహించి బహుమతులు ప్రధానం చేసింది.

2007లో ముదిగొండ లో భూపోరాటం చేస్తున్న ప్రజలపై కాల్పులు జరిపి ఐదుమందిని పొట్టనపెట్టుకొంది ప్రభుత్వం. దీనికి నిరసనగా సాహితీస్రవంతి కవిసమ్మేళనం నిర్వహించింది. రాష్ట్రస్థాయిలో వచ్చిన కవితాగ్రహాన్ని" భూస్వరాలు" పేరుతో సాహితీస్రవంతి రాష్ట్ర శాఖ కవితా సంకలనాన్ని తీసుకు వచ్చింది. ఈ సంకలనాన్ని అనంతపురం లో యు .ఎ . నరసింహారావు రచించిన 'కన్యాశుల్కం - ఆధునిక భారతీయ నాటకాల' తో పాటు సాహితీ స్రవంతి ఆవిష్కరించింది. ఈ సంకలనంలో అనంతపురం కవులు చాలా మంది వున్నారు.

జిల్లా నగర స్థాయిలో అనేక సాహిత్య కార్యక్రమాల ను నిర్వహించడం వల్ల వచ్చిన సంబంధాలతో 2011 లో సాహితీ స్రవంతికి జిల్లా స్థాయి కమిటీ ఏర్పడటానికి అవకాశం ఏర్పడింది. ప్రధాన కార్యదర్శిగా తగరం క్రిష్ణయ్య ,జిల్లా అధ్యక్షునిగా పిల్లా కుమారస్వామి, కార్యదర్శులుగా ఆకుల రఘురామయ్య, ముకుందాపురం పెద్దన్న ,ఉపాధ్యక్షులుగా అంకె రామలింగమయ్య ,ఎర్రిస్వామి ,కొశాదికారిగా ప్రజ్ఞ సురేష్ ,సభ్యులుగా ఆవుల జయప్రద (ఉరవకొండ ), సివన్న (మడకశిర), రామకృష్ణ, శేషాచార్యులు, జూటూరి షరీఫ్ లతో ప్రథమ జిల్లా కమిటీ ఏర్పడింది. నూతన కమిటీ చురుకుగా అనెక కార్యక్రమాలను నిర్వహించింది.

అంతకు ముందు జిల్లా వ్యాప్తంగా ఆహ్వానించగా వచ్చిన కవితలన్నీ క్రోడీకరించి మల్లెల నరసింహమూర్తి,

వి ళ్ళా కు మా ర స్వా మి సంపాదకత్వంలో "అనంత కవితాస్వరాలు" పేరుతో కవితాసంకలనాన్ని తీసుకువచ్చింది . అదే సందర్భంలో రెండవ జిల్లా కమిటీ కూడా ఏర్పడింది . కమిటీలో 'ప్రధానకార్యదర్శిగా ప్రజ్ఞా సురేష్, అధ్యక్షులుగా పిళ్ళా కుమారస్వామి, ఉపాధ్యక్షులుగా అంకె రామలింగమయ్య , బాలభారతమ్మ , కార్యదర్శులుగా రియాజుద్దీన్, ఆకులరఘురామయ్య బాధ్యతలు తీసుకున్నారు. నెలనెలా క్రమం తప్పకుండా సంవత్సరం పాటు సాహితీ సమయం కార్యక్రమాన్ని నిర్వహించడం ద్వారా అనంతపురం నగర కమిటీ కూడా ఏర్పడటానికి దోహదపడింది . నగరకమిటీలోఅధ్యక్షులుగా వై.సూర్యనారయణ రెడ్డి ,నగర ప్రధాన కార్యదర్శి గా పోకూరి చంద్రశేఖర్ ,ఉపాధ్యక్షులుగా నీరుగంటి వేంకటేశు ,కార్యదర్శిగా రవిచంద్ర భాద్యతలు తీసుకొన్నారు




అనంత కవిత స్వరాలు కవితా సంకలనాన్ని పరిచయం చేసేందుకు కదిరి,హిందూపురం,ఉరవకొండ ధర్మవరం ప్రాంతాలలో జిల్లా అధ్యక్షులు పిళ్ళా కుమారస్వామి పర్యటించి జన కవనాలను కూడా నిర్వహించారు. ఆ సందర్భంగా కదిరిలో ఆ శాఖ అధ్యక్షులుగా చలపతి,ప్రధాన కార్యదర్శిగా చిన్నారావులతో ఒక కమిటీ ఏర్పడింది . హిందూపురం లో నాగశేషు,అశ్వర్థనారాయణ ప్రధానకార్యదర్శి , అధ్యక్షులుగా వ్యవహరిస్తూ కమిటీ ఏర్పడింది . ఉరవకొండ లో ఆవులవెంకటెసులు ,గంగాధర్ లు అధ్యక్ష కార్యదర్శులుగా కమిటీ ఏర్పడింది . ధర్మవరం లో నూతనశాఖ ఏర్పడింది . ఈ శాఖ ప్రధాన కార్యదర్శిగా ఇటికంటి మహేష్ , అధ్యక్షులుగా శారద ఉపాధ్యక్షులుగా సత్యనిర్ధారన్ తదితరులతో కమిటీ నిర్మాణం జరిగింది .

ఈ సంవత్సరం(2016) అనంతపురం నగర కమిటీ రాష్ట్రంలోనే ప్రధమంగా కవులు రచయితలతో కేలండరును రూపొందించి ఆర్ట్స్ కళాశాలలో ఆవిష్కరించింది . అలాగే ఆర్ట్స్ కళాశాల తో కలిసి జిల్లాలోని దివంగత సాహిత్యకారులపై ప్రతి నెల 3వ ఆదివారం సాహితీసమాలోచన నిర్వహించాలని నిర్ణయించింది .ప్రధమంగా మాతృభాషాదినోత్సవం రోజున వేమనపై నిర్వహించడం జరిగింది. హిందూపురం ,ధర్మవరం ,అనంతపురం కమిటీలు కూడా మాతృ భాషాదినోత్సవాన్ని నిర్వహించాయి . మార్చినెలలో మహిళా దినోత్సవాన్ని ధర్మవరం , అనంతపురం నగరం,హిందూపురం శాఖలు నిర్వహించాయి.

ఏప్రిల్ మాసంలో జిల్లా శాఖకథ ,కవిత్వంలపై సాహిత్యశాల నిర్వహించింది . ఈ సందర్భంగా జిల్లాలో ఏర్పడిన ప్రాంతీయ కమిటీ సభ్యులతో మూడవ జిల్లా కమిటీ ఏర్పడింది . ఈ కమిటీ లో అధ్యక్షులుగా ప్రగతి , ప్రధాన కార్యదర్శిగా రవిచంద్ర ,ఉపాధ్యక్షులుగా సత్యనిర్ధారన్ (ధర్మవరం ),అశ్వర్థనారాయణ (హిందూపురం), వై. సుర్యనారాయణ రెడ్డి (అనంతపురం), సహాయ కార్యదర్శులుగా నీరుగంటి వెంకటెసు (అనంతపురం), ఇటికంటి మహేష్ (ధర్మవరం ) పిళ్ళా కుమారస్వామి (రాష్ట్ర కమిటీ సభ్యులు), సభ్యులుగా నానీల నాగేంద్ర(అనంతపురం), నర్సిరెడ్డి (పెనుగొండ), తిప్పేస్వామి(కల్యాణదుర్గం), గంగాదేవి , ధరిత్రీదేవి ,యమునా,హిదయతుల్లా ,రసూల్ ,శ్రీధర్నాయుడు ,బుదేన్సాబ్, చంద్రశేఖర్ (యూనివర్సిటీ ), లక్ష్మినారాయణ (యూనివర్సిటీ ) భాద్యతలు తీసుకున్నారు

ఆంధ్రరాష్ట్రం విడిపోయాక జిల్లాలో రాయలసీమ ప్రత్యేకరాష్ట్ర ఉద్యమసన్నాహాలు చాలా రచయితలు మేధావులతో ప్రారంభమయ్యాయి. రాయలసీమలో అనంతపురంజిల్లా పూర్తిగా వెనుకబడి వుంది. అందువల్ల ఈ ఉద్యమం అనంతపురంలోనే ఊపందుకుంది. కొంతమంది రచయితలు బహిరంగంగా దీనిని ప్రోత్సహిస్తున్నారు. అంతేగాక ప్రపంచీకరణ ప్రభావంతో జిల్లాలోభాషా సంస్కృతులపై పెనుప్రభావం పడుతోంది. ఈ నేపథ్యంలో తెలుగు భాషా సంస్కృతులను రక్షించుకోవాలని సాహితీస్రవంతి ప్రయత్నం చేస్తూ ముందుకు సాగుతున్నది. వర్తమాన పరిస్తితుల్లో సాహితీ స్రవంతి కొత్తతరం సాహితీ సృజనకారులను గుర్తించి ప్రజా సాహిత్యకారులుగా తీర్చి దిద్దాల్సిన కర్తవ్యాన్ని గుర్తించింది . జిల్లాలో సాహిత్యాభివృద్దికి ప్రభుత్వం ఎలాంటి చర్యలు చేపట్టడం లేదు. ఉగాది రోజున తూతూ మంత్రంగా కవిసమ్మేళనాలను నిర్వహిస్తొంది. తెలుగు భాషా సంఘం ఉనికిలో కూడా లేదు. అదే సందర్బంలో వర్ధమాన సాహిత్యకారుల్లో సాహిత్యం పట్ల తపన ఉండటం గమనార్హం. వీరి తపనను గుర్తించి సాహితీ స్రవంతి సాహిత్యకార్యశాలలను విరివిగా నిర్వహించాల్సిన అవసరం ఉంది.





అనంతపురం సాహితీస్రవంతి, ఆర్ట్స్ కళాశాల సంయుక్త ఆధ్వర్యంలో ప్రతీ నెలా మూడవ ఆదివారం జరిగే సాహితీ సమాలోచన కార్యక్రమంలో 'రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ సాహిత్య కృషి' అంశంపై ప్రసంగిస్తున్న అంకే శ్రీనివాస్. చిత్రంలో శ్రీధర్ నాయుడు ఉన్నారు.



నల్లగొండ జిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో పెన్షన్ భవన్‌లో మేడే రోజు జరిగిన మేరెడ్డి యాదగిరి రెడ్డి 'బొడ్రాయి కథలు' పుస్తకావిష్కరణ దృశ్యం. చిత్రంలో డా॥ నోముల సత్యనారాయణ, డా॥ సుంకిరెడ్డి నారాయణ రెడ్డి, కథారచయిత శిరంశెట్టి కాంతారావు, విమర్శకులు వేణు సంకోజు దాసి సుదర్శన్, కథారచయిత నిర్మల్, జిల్లా రచయితల సంఘ కార్యదర్శి పున్న అంజయ్య, పెందెం జగదీశ్వర్, చిన వెంకట్‌రెడ్డి, జి. దామోదర్ రెడ్డి, పున్న అంజయ్య తదితరులు ఉన్నారు.

## శిలపరశెట్టి పురస్కారం

గత ఆరేళ్లుగా శిలపరశెట్టి రాములు నాయుడు స్మారక కవితా పురస్కారం అందిస్తున్న ఎస్.ఆర్ నాయుడు చారిటబుల్ ట్రస్ట్ ఈ ఏడాది 7వ పురస్కారం అందజేయనున్నట్లు మాధవీ సనారా ఒక ప్రకటనలో తెలిపారు. ఇందుకోసం కవులు 2015 జనవరి నుండి డిసెంబరు మధ్యలో వెలువరించిన తమ స్వీయ కవితా సంపుటాలు 3 ప్రతులు పంపాల్సి వుంటుంది. ఉత్తమ కవితా సంపుటి కవికి రూ. 3116/- నగదు, ప్రశంసా పత్రంలో సత్కారం వుంటుంది. జూన్ 2016లోగా మీ పుస్తకాలు మాధవీ సనారా, 14-18-1, కామాక్షి కో వెల వీధి, నిదానం దొడ్డి, అనకాపల్లి - 531002. విశాఖ జిల్లాకి పంపండి.



మార్చి 24 న హైదరాబాద్‌లో త్యాగరాయ గాన సభలో డా॥ సి. భవానీదేవి "ఇంత దూరం గడిచాక" కవితా సంపుటిని ఆవిష్కరించిన ఆచార్య ఎన్. గోపి. సభలో శ్రీయుతులు జి. వల్లీశ్వర్, విహారి, రఘురాం, కళా వెంకట దీక్షితులు తదితరులు



గుంటూరు జిల్లా అరసం ఆధ్వర్యంలో ఐదుగురు ప్రముఖ కథల "ఐదు కలాలు...ఐదేసి కథలు" కథా సంకలనం ఆవిష్కరణ దృశ్యం. చిత్రంలో శ్రీమతి నామని సుజనా దేవి, డి. ధర్మారెడ్డి, పెనుగొండ లక్ష్మీనారాయణ. ఆవిష్కరించిన పెనుమాక నాగేశ్వరరావు, కొత్తపల్లినాగేశ్వరరావు డా॥ ఎమ్.వి.జె భువనేశ్వరరావు, వదలి రాధాకృష్ణ, శ్రీమతి గోటేటి లలితా శేఖర్‌లు ఉన్నారు.



విజయవాడలో మే1 న అడిగోపుల వెంకటరత్నమ్ రచన "రేపటి జ్ఞాపకం" కవితా సంపుటిని డా. తుర్లపాటి కుటుంబరావు ఆవిష్కరిస్తున్న దృశ్యం. చిత్రంలో సోమేపల్లి వెంకటసుబ్బయ్య, పొట్లూరి హరికృష్ణ (ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అధికార భాషా సంఘం అధ్యక్షులు) డా. గుమ్మా సాంబశివరావు, అడిగోపుల వెంకటరత్నం, గోళ్ళ నారాయణరావు.

## దక్షిణ కొరియా రచయిత్రి హ్యాన్ కాంగ్‌కు 2016 మ్యాన్ బుకర్ అంతర్జాతీయ బహుమతి

ప్రతియేటా మ్యాన్ బుకర్ సంస్థ ప్రకటించే బహుమతులకు ప్రపంచవ్యాప్తంగా మంచి ప్రచారం లభిస్తుంది. లండన్ కేంద్రంగా మ్యాన్‌బుకర్ సంస్థ కాల్పనిక రచనలకు ప్రాచుర్యం కల్పించడానికి ప్రతి యేటా ఈ కార్యక్రమం నిర్వహిస్తుంది. ప్రతీ సంవత్సరం ఇచ్చే మ్యాన్ బుకర్ బహుమతితో పాటు ప్రతి రెండు సంవత్సరాలకు మ్యాన్‌బుకర్ అంతర్జాతీయ బహుమతి కూడా అందజేస్తుంది. ఆ బహుమతిని ఈ సారి దక్షిణ కొరియా రచయిత్రి హ్యాన్ క్యాంగ్ దక్కించుకున్నారు. హ్యాన్ కాంగ్ కొరియా భాషలో రాసిన నవలను 'ద వెజిటేరియన్' శీర్షికతో డెబోరా స్మిత్ ఇంగ్లీషులోకి అనువదించారు. ఈ నెల 16న హ్యాన్ కాంగ్‌తో పాటు అనువాదకురాలు కూడా అదే మొత్తంలో బహుమతి అందుకున్నారు. అనువాద ప్రక్రియను కూడా సృజన ప్రక్రియగా గుర్తించి ప్రాధాన్యతను ఇవ్వాలని ఈ బహుమతి ఇస్తున్నట్టు నిర్వాహకులు ప్రకటించారు. పలు దఫాలుగా జరిగే ఈ బహుమతి ఎంపిక ప్రక్రియ ఆసక్తికరంగా ఉంటుంది. లాంగ్ లిస్ట్‌లో 10 పుస్తకాలు, షార్ట్ లిస్ట్‌లో 5 పుస్తకాలు ఎంపిక చేసి చివరగా ఒక పుస్తకాన్ని ఎంపిక చేస్తారు. ఈ జాబితాలో చోటు చేసుకున్న పుస్తకాలన్నిటినీ ప్రపంచవ్యాప్తంగా వున్న పుస్తక ప్రియులు గమనిస్తూ ఉంటారు. రచయిత్రిది ఇంగ్లీషులోకి అనువాదం అయిన తొలి పుస్తకం 'ద విజిటేరియన్'. అంతేకాకుండా అనువాదకురాలు కొరియా భాష నేర్చుకుని అనువదించిన తొలి నవల కూడా ఇదే. అయినా కూడా అనువాదం చాలా గొప్పగా ఉందని న్యాయనిర్ణేతలు అనువాదకురాలిని ప్రశంసలతో ముంచెత్తారు. ఏది ఏమైనా 155 పుస్తకాల్లోంచి ఎంపికైనా 'ద వెజిటేరియన్' పుస్తకం ప్రత్యేకత చదివి తెలుసుకోవల్సిందే.






హైదరాబాద్‌లో మే 8న తెలుగు విశ్వవిద్యాలయం, ఎన్‌టిఆర్ హాలులో శ్రీమతి రావు బాలసరస్వతీదేవి, డా॥ 'ఊర్వశి' శారద, ప్రముఖ సినీనటి శ్రీమతి ప్రభారమేష్, డా॥ అమృతలత, అవార్డు గ్రహీతల మధ్య డా॥ ఎన్. గోపిగారిచే 'అభినందన' సావనీర్ ఆవిష్కరణ.



తూర్పుగోదావరి జిల్లా, కొత్తపేటలో మే 8న కళాసాహితి ఆధ్వర్యంలో ఉగాది సభలో జరిగిన ఎస్.ఆర్. పృథ్వి 22వ పుస్తకం "జ్ఞాపకాలే ఊపిరిగా" (దీర్ఘకవిత) ఆవిష్కరణ దృశ్యం. చిత్రంలో ఆవిష్కర్త కె. కాత్యాయన శర్మగారు, జి. సుబ్బారావు ప్రముఖ శిల్పా చార్యులు, ఉదయర్, వియస్ఆర్ఎస్ సోమయాజులు, బుద్ధ చంద్రదేవ్, రోటరీ అధ్యక్షులు పాల్గొన్నారు.

## గుంటూరు జిల్లా రచయితల సంఘం సాహిత్య పురస్కారాల విజేతలు

గుంటూరు జిల్లా రచయితల సంఘం ప్రతియేటా నిర్వహిస్తున్న సాహిత్య పురస్కారాలు ఈ యేడాది కవితా పురస్కారానికి గాను 'శ్రీ యం.వి రామిరెడ్డి' రచించిన "అజరామరం" కవితా సంపుటికి, కథా పురస్కారానికి గాను శ్రీ "పి.వి. సునీల్ కుమార్" రచించిన "నీలవేణి" కథా సంపుటికి లభించాయి. గతంలో ఈ పురస్కారాలను శిలాలోలిత, బండ్ల మాధవరావు, డా॥ నక్కా విజయరాజు, డా॥సి. భవానీ దేవి తదితరులు అందుకున్నారు. జూన్ నెలలో గుంటూరులో జరుగబోయే పురస్కార ప్రధానోత్సవ సభలో శ్రీ యం.వి రామిరెడ్డి, శ్రీ సునీల్ కుమార్‌లను చెరి రూ 5,000/- ల నగదు, జ్ఞాపికతో సత్కరించడం జరిగింది.



విశాఖ రచయితల సంఘం ఆధ్వర్యంలో మే 14న విశాఖ పౌర గ్రంథాలయంలో విశాఖ కథా తరంగాలు ఆవిష్కరణ సభ. చిత్రంలో కథా రచయితలు ఆనందరావు పట్నాయక్, చందు సుబ్బారావు, అడపా రామకృష్ణ, ద్విభాష్యం రాజేశ్వరరావు

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,

31.08.1925 - 04.06.1998




51

సుప్రసిద్ధ అభ్యుదయ కవి, రచయిత, పరిశోధకుడు, విమర్శకుడు త్వమేవాహంతో తెలుగు కవిత్వంలో కొత్త ప్రయోగశైలి ప్రారంభించారు. అనేక కావ్యాలు, పరిశోధనా గ్రంథాలు రాశారు. సమగ్ర ఆంధ్రసాహిత్యం 13 సంపుటాలు ఒక చేతి మీదుగా రచించి తెలుగు సాహిత్యానికి ఎనలేని సేవ చేశారు. జూన్ 04 ఆరుద్ర వర్ధంతి



| | |
|---|---|
| | **మనసు ఫౌండేషన్**<br>**పుస్తకాల పరిశీలనాపట్టిక** |

| | |
|---|---|
| **పుస్తకం సంఖ్య** | PRSVMO2A171 |
| **పుస్తకం పేరు** | [illegible] |
| **తారీఖు** | 25/5/24 |
| **ముందు అట్ట** | yes |
| **వెనుక అట్ట** | yes |
| **మొత్తం పేజీలు** | 53 |
| **పెద్ద సైజు పేజీలు** | NO |
| **ఖాళీ పేజీలు** | NO |
| **లేని పేజీలు** | NO |
| **తయారు చేసినది** | Gayatri |
| **పేజీలు విడదీసినది** | Gayatri |
| **స్కాన్ చేసినది** | [illegible] |
| **పరీక్ష చేసినది** | prathyusha |
| **పేజీలు సరిచూసినది** | |
| **బైండింగు చేసినది** | |
| **ప్యాకింగు చేసినది** | |
| **స్కాన్ చెయ్యనివి** | |
| **తప్పులు** | No |
| పరిస్థితి | good |